చెందియుండితిమి. మన తొల్లింటి విజ్ఞానము పసిబాలుర జిలిబిలిపలుకులుగా తోచెను. ఇక మన బ్రతుకెందుకు? మన జాతికి గర్వించదగిన ప్రాచీనచరిత్రయే లేదనుకొన్నాము. కాని క్రమముగ ఈ విద్యుత్కాంతి మన కనుల కలవాటైన తోడనే నవ్యదృష్టితో వెనుక వస్తువులలో వెదుకగా ఎన్నో యనర్ఘరత్నములు గాన్పించెను. ఇదివరకు చీకటియనుకొన్నది చీకటిగాక వెన్నెలయే యని తోచెను. వెఱ్ఱిసంతోషముకల్గెను. మనముకూడ నాజానుబాహులమే; బుడుతలము కా మను నాత్మవిశ్వాసము నాటుకొన్నది. ఇట్టి యాత్మవిశ్వాసముతో కరడుగట్టిన యువకులము మనము.

## రెండవ రొమాంటిక్ ఉద్యమము
## Second Romantic Movement.

ఆధునికయుగఫలమే ఆధునికకవిత్వము. ఆధునికాంధ్ర కవులు ముఖ్యముగ నాంగ్ల సారస్వతమును, అందును (Second Romantic Movement) రెండవ పరివర్తనదశ అని చెప్పబడు సాంప్రదాయమునకు చెందిన కవులయొక్క కావ్యామృతమును దనివితీర గ్రోలినారు. అనగా ఈ రెండవ కవిత్వపుపొంగునకు జెందినవారికి దాసులైనారనికాదు. ఈ రెండవ కవిత్వావిర్భావపుకవులలో నేయుద్రేకము, సరసత, ప్రకృత్యారాధన, ప్రణయసమారాధన ముఖ్యలక్షణములుగ పరిగణింపబడుచున్నవో, అట్టి యుద్రేకము, సరసత, ప్రకృతిభక్తి, ప్రణయారాధనము వీరియందు గాన్పించుచున్నవి.

ఈలక్షణములను వీరు ఎరువునగలవలె ధరింపక తమలో జీర్ణము చేసికొని ఆంధ్రభాషాసేవకై వినియోగించిరి. ఈయాదర్శములు వీరిలోనే సహజముగ పుట్టి సజాతీయములైన భావముల ప్రేరేపణచే నుద్దీపించెను. ఆంగ్లసారస్వతమునం దీరెండవ పరివర్తనదశ వర్డ్స్వర్తు (Wordsworth) కాలెరిడ్జి (Coleridge) అను కవిశ్రేష్ఠులతో నారంభించినది. మిల్టను (Milton) మహాకవి యస్తమించినతరువాత ఆంగ్లకవిత్వము మన దేశపు ప్రబంధయుగానంతరమువలెనే రక్తిచెడి రసవిహీనమైన వాగులలో పారుచుండెను. కవిత్వమందు రసము ధ్వని మున్నగువాటికన్న భాషకును రీతికిని యెక్కువ ప్రాముఖ్యత యివ్వబడెను. నాటి కాలపు కవులలో నుద్రేకము శూన్యము. హృదయమును రంజించుటకన్న చెవికి విందొనగుటలో వా రెక్కువ పాటుబడిరి. ప్రజలకు విసువుపుట్టి మానవుని క్షుద్రవిషయములనుండి సంకుచితదృష్టినుండి విశాలమై, అనంతమై ప్రేమమయమయిన ప్రకృతివంకకు మరలిరి. వారిలో వర్డ్స్వర్తు కాలెరిడ్జియనువారు మార్గదర్శకులు.

## నేటి కవిత్వము యొక్క ఆదర్శములు

ఆంధ్రప్రపంచ మిదేవిధమున ప్రబంధయుగానంతరమందలి రసభావశూన్యమైన కవిత్వముతో నసంతృప్తి నందెను. కవిత్వమును ఎవ్వరో యిర్వురు కల్పితనాయికానాయకుల కల్లమోహమును లేనియావేశముతో వర్ణించుటయందు వ్యర్థము చేయుట కవిత్వనామమునకు కళంకమని యెంచిరి. కవిత్వమున

కుండవలసిన ముఖ్యలక్షణము లీకవిత్వమందు మృగ్యములు. రాయప్రోలువారు వచించినట్లు కవిత్వము

,,వేడుకయు, వేదనయు రసవిదులుమురియ
పాడవమ్మ ! గీతాసఖి ! భావపదము.''

వేడుకయనగా ఆనందము. వేదనయనగా కరుణార్ద్రి భావమునుకల్గించుట. కవిత్వమితరకళలవలెనే మానవహృదయమునకు ఆనందస్ఫురణముగల్గించి తద్ద్వారా పరమాత్మస్వరూపమైన ఆనందసాన్నిధ్యమును కలిగించును. ఇది హైందవ దృక్పథము. పూర్వజాతులలో కళానిధులని పేరువడసిన గ్రీకువారు (Greeks) కవిత్వాదర్శము నిట్లు నిర్వచించిరి. అరిస్టాటిల్ (Aristotle) అను విద్వాంసు డిట్లు చెప్పెను.

'Through pity and fear to purge the feelings'

అనగా మానవహృదయమును భావములను దయాభయ ఘట్టములలో నుఱ్ఱూతలూగించి, వేచి, తద్ద్వారా ప్రేక్షకుని ఈశ్వరునివంక మరలునట్లుచేయుట కవిత్వము పని. హృదయము కరగించునట్టియు భయాతిరేకంబున నీశ్వరమహాత్వము తలపింపచేయునట్టియు కథావస్తునిర్మాణము చేసి మనుజహృదయమును అధోముఖమైన తలంపులనుండి లేవనెత్తి గొప్ప భావములు మహదాశయములు గల్గించుట కవిత్వాదర్శ మని గ్రీకువారి నమ్మిక. అటు ఆనందము ఇటు వేదన రెండును సమన్వయించినది ఈనాటి కవిత్వము.

నేటికవిత్వమునకు తొలికోడి కూత గురజాడవారి లేఖిని నుండి వెడలినది. వర్డ్స్వర్త్ కాలెరిడ్జి యను వారు

(Lyrical Ballads) అను కవితామంజరిని ప్రకటించి వారికి ముందు ప్రచారములోనున్న నిస్సారకవితారీతులకు స్వస్తిచెప్పినట్లే అప్పారావుగారి 'ముత్యాలసరములు' ఎండి బీటలువారిన ఆంధ్రకవితాసీమపై తొలకరిచినుకులులా పడెను-కాదు; వడగండ్లవలె వర్షించెను.

'గురుత్తునా ముత్యాలసరములు'

క్రొత్తపాతల కలయిక చేసి నూతన సారస్వత ప్రపంచమును సృజింపబూనుకున్నాడు ఈకవి. దీని కెవ్వరైన వ్యతిరేకులున్నను ఈతడు సరకుజేయడు. ఈ నవకవిత్వపద్ధతిని మెచ్చనివారు నిర్జీవప్రతిమల గొల్వ నలవడినవారని ఈకవి ముక్తకంఠముతో చెప్పుచున్నాడు.

"మెచ్చనంటా వీవు; నీవిక
మెచ్చకుంటే మించిపాయెనె
కొయ్యబొమ్మలకొలుచు కనులకు
కోమలులసా రెక్కునా."

ఇట్లే బసవరాజువారు

"నన్నెవ్వ రాపలే రీవేళ
నాధాటి కోపలే రీవేళ!
గుండు తారామంచు
కొట్టినట్టుగ నేటి
పండితులు తారెత్తి
పరుగుచ్చుకోవాలి."

## నేటి సాంఘిక తిరుగుబాటు

గురజాడవారు సనాతనాచారములను ప్రతిఘటించి తిరుగుబాటు జెండా నెత్తినవారిలో ముఖ్యులు. సంఘమునందు ప్రబలినదురాచారములను గని రోషతామ్రాక్షులైన వీరు పాశ్చాత్యనాగరకత కొకింత దాసులై యుండిరి. మనవారి వ్రాతలు సత్యదూరములని ధ్వనించునట్లు వీరు వ్రాసినవాక్యములు గనుడు.

"కన్నుగానని వస్తుతత్వము
కాంచ నేర్పరు లింగిరీజులు
కల్లనొల్లరు వారివిద్యల
కరచి సత్యము నరసితిన్."

మనవారిని చన్నకాలపు చిన్నబుద్ధులని లాఘవము చేసిరి. ఇందుకై మనము వీరిని విమర్శింప బనిలేదు. తిరుగుబాటెప్పుడును ఆవేశపూరితమై ముందున్నదానిని తృణీకరించి వెల్లువలో కొట్టివేయనెంచును. అది తిరుగుబాటు యొక్క స్వభావము. క్రొత్తనీటివడిలో అడ్డువచ్చిన వన్నియు కొట్టుకొని పోవలసినదే గదా!

ఇట్లే బంగాళమునందును పూర్వరచనలపైనను, పూర్వపద్ధతులపైనను, పూర్వాచారములపైనను దండెత్తిన ఆధునికులు పూర్వ మను పేరుదాల్చినదెల్ల నింద్యమనియు, కపటమనియు నమ్మి ఖండించిరి. కవిత్వమునందు నిదే భావము వ్యాపించెను. మైకేల్ మధుసూదనదత్తను నాతడు ఈ తిరుగు

బాటుకవులలో నగ్రగణ్యుడు. ఆధునిక బంగాళీభాషను నిర్మించిన మహనీయు డీతడే యని వినుచున్నాము. మధుసూదనదత్తుయొక్క తిరుగుబాటు ఆవేశములో ఆర్యవీరులుకూడ కుటిలురుగను వారి ప్రతికక్షులే యోగ్యులుగను గన్పట్టిరి. కావుననే ఈతడు రామాయణమువంటి గ్రంథమును గూర్చి వ్రాయుచు

'I hate Rama and his rabble but Ravana is a fine chap.' అనెను.

ఈతడు 'మేఘనాదవధ' యను నుత్కృష్ట కావ్యమును రచించెను. ఈకావ్యమును మిల్టనుయొక్క Paradise Lost మాదిరిగ కవి యూహించి Satan కు సంవదించునట్లు మేఘనాదుని యూహాప్రపంచమున గాంచెను. గురజాడవారుకూడ ప్రాథమిక బంగాళీ తిరుగుబాటుదారులవలె ప్రాచీనతత్వమున కివ్వవలసినంత గౌరవము నొసగరైరి.

ఆధునికయుగమువారు తా మొక నవయుగములో నివసించుచున్నామని గట్టిగా నమ్ముచున్నారు. ఇదేభావము కవికుమారులు తమ గానమునందు వెలిబుచ్చుచున్నారు.

'కిన్నెరలు పాడుచున్నవి గీతములను
కప్పురంపుదుమారముల్ గొట్టినటుల
బదిదెసల గప్పుగొనె గాఢపరిమళంబు'

—రాయప్రోలువారి 'తెనుగుతోట'

ఈయుగమునందు జనులు మహాదాదర్శప్రేరితులని కవి చాటుచున్నాడు.

"క్రిమ్మియున్నది నూత్నరాగమ్ము భువిని
నవనవకుతూహలప్రసూనములు పూచె."

ఇట్టి భావములు నవ్యయుగద్యోతకములో, నీరసయుగ చిహ్నములో భావిమానవులే నిర్ణయించుకొనగలరు. కాని అవియెల్ల ప్రతిభావంతము, స్వతంత్రభావపూరితము నగు ఆధునికయుగముయొక్క ప్రాణవాయువులని నిరూపించు భారము యువకులమగు మనపై గలదని చెప్పి విరమించెదను.

[ఆంధ్రయువజనసంఘపక్షమున నొసంగబడిన అధ్యక్షోపన్యాసము.]

—:o:—

# భావకవిత్వము

సోదర సోదరీమణులారా !

ఇంతకుమున్నొకమారు భావకవిత్వమందమలయానిలములు కవిమనోవీథులం దెట్లు వీచుట కారంభించెనో విశదీకరించితిని.

## మహారంభములు : మహాకవులు

ప్రబంధసూర్యుఁ డస్తమించినవెనుక ప్రతిభాన్వితులైన కవులు లేకపోవుటచేతను, సంఘము నైతికకర్దమములోను, రాజకీయపుటురులలోను దగుల్కొనుటచేతను కవిప్రతిభామూలకమైన కవికర్మకు అవకాశము లోపించెను. మనజాతియొక్క సారస్వతజీవనమందు అంధకారయుగ మనదగిన ఈ కాలమందు నిజమైన కవిత్వవాహిని నిదాఘసంతప్తమైన యేరువలె నింకిపోయెను. మన సాంఘికజీవితమునందుగూడ ప్రత్యేకత్వము లేకుండెననియు, జడభావము, అసత్యాడంబరము, లంపటత్వము ఎల్లెడల ప్రబలియుండెననియు నూతనయుగపుటంచుల నిలబడిన వీరేశలింగకవిప్రభృతులు విమర్శించుట మీకు విదితము.

ఏజాతియందు నూతనోద్యమోత్సాహము లేకెత్తదో, ఏజాతి స్థాణువువలె పౌరాతన్యమను నిర్జీవప్రతిమ నారాధించుటలో నిర్మగ్నమైనదో ఆజాతియందు మనోవృత్తులు, సాహసము నశించును. స్వర్నదీతోయమువలె నిర్మలమైన జాతి

జీవనము, ఉత్సాహసమన్వితమైన నవనవారంభములు, రసార్ద్రీభూతములైన మనోవృత్తులు లేనినాడు జీవ ముట్టిపడుకవిత్వము ఆవిర్భవింపనేరదు. మిల్టను అను మహాకవి తన జీవిత నిబంధనముగా నేర్పరచుకొన్న సూత్రము మీా రెరుంగనిది కాదు. "A poet must live the poem" అన్నాడు మిల్టను (Milton). సత్కావ్యమం దేపావిత్ర్యము, నిర్మలావేశము, ఔన్నత్యము కుంభించునో కవి కాదలచినవానిజీవితమం దట్టి పావిత్ర్యము, అట్టి సత్యమైన ఆవేశము, అదే ఔన్నత్యము నిర్ణిద్రములు కావలెను. మహోన్నత సామ్రాజ్యనిర్మాణధౌరంధర్యమును అల్పబుద్ధియు ఒకేపురుషునం దెట్లు అసంభావ్యములో అట్లే నీరసమనోవృత్తులుగలపురుషునందు సత్కావ్యనిర్మాణప్రౌఢిమ మృగ్యము. తనచుట్టునుండు మానవసంఘమంతయు ప్రాణధారణకు యత్నించినైనను మద్యపానమత్యంతావసర మని విశ్వసించుచున్నప్పుడు మిల్టనుకవి చల్లనినీరు మాత్రము త్రావెడివాడట. తన యాకృతిగ నిర్మించిన Samson Agonistes అను అంధవీరునిచేగూడ మిల్టను మంచి నీళ్ళనే త్రావించెను.

మహోన్నతాదర్శజీవితముమాత్రమే జీవకవిత్వమును సృజింపనేరదు. అట్లయినచో మిల్టనుకాలములో పరిశుద్ధజీవనులు (Puritans) ఎంతమందిలేరు ? వారందరు కవులైరా? మనలో మాత్ర మనాదికాలమునుండియు విశుద్ధాత్ములును, అమలజీవనులు నయినవా రెందరులేరు ? ఉన్నతజీవితమునకుతోడు మేరుప్రమాణమైన కల్పనాశక్తియు ప్రతిభయు నుండవలెను. ఈ

కల్పనాశక్తి యజ్ఞకాష్ఠమందున్న అగ్నివంటిది. ఇది మథించిన గాని మిణుగురులు రాల్పదు. కలసి త్రోద్రోపులాడెడి కారు మొయిళ్ళరాయిడినుండి పుట్టిన విద్యుజ్జ్వాలవంటిది.

జాతుల ప్రతిభలు శాంతియందుకన్న పెనకువలయం దెక్కుడుద్దీపించును. ఆంగ్లజాతి స్పెయినువారితో ప్రాణములకై పెనగుచున్న కాలములోనే ఆంగ్లసారస్వతవిహంగము, అదివరకు రెక్కలల్లార్పలేనిది, విహాయసగామియై చరించెను. అట్లే 18 వ శతాబ్దాంతమందు నెపోలియన్ జగదేకవీరునితో తన యస్తిత్వమునకై ప్రతిఘటించుచున్నప్పుడు కూడ Wordsworth వంటి కవుల ప్రతిభావేశమును ప్రసవించెను. కారణములు మహాహ్వాములు కావు మహోద్యమవుటలలో శౌర్యసాహసములు ప్రాణహాయువులు; ఆత్మార్పణములు ప్రతివారి సొమ్ములు; విశుద్ధప్రేమలు నట్టింటిదివ్వెలు. ఇవిగాక కవిమనోవికాసములైన వస్తుసముదాయము లేవి గలవు ?

ఈ సూత్రమునే మన వాఙ్మయచరిత్రనుండి మీరు గ్రహింపగలరు. శ్రీరాముడనార్యుల నిర్జించి యార్యవిజయ దుందుభులతో నయోధ్య ప్రవేశింపకపూర్వమే

మా నిషాద ప్రతిష్ఠాం త్వ మగమః శాశ్వతీస్సమాః
యత్క్రౌంచమిథునాదేక మవధీః కామమోహితమ్.

అను ఛందోబద్ధమైన సరళకవితావాహిని కరుణాప్లావితమైన వాల్మీకిహృదయమునుండి వెడలినది. కురుక్షేత్రమందలి రక్తనదు లెండి పోకుండగనే

"పాండవేయుల పదనుకత్తుల
మండి మెరసిన మహితరణకథ"

ఇతిహాసరూపమునంది, నేటికిని భరతఖండవాస్తవ్యులకు శౌర్యరసమును పిదుకుచున్నది. వీరాగ్రేసరుడైన తన మేలిక హూణులమూకలను చెండాడి విజయశ్రీసమేతుడై రాజధానికి వచ్చుచుండ

"అనుత్సేకః ఖలు విక్రమాలంకారః"

అని ముసిముసినవ్వులతో కాళిదాసెదుర్కొనుచున్నాడు. పరాక్రమోద్ధతులైయాంధ్రసైనికులు కృష్ణరాయల యప్రతిహతఖడ్గధారలు తోడుగ, పొట్నూరికి సమీపమున నాంధ్రసామ్రాజ్య దిగ్జయస్తంభ మెత్తించుచుండ అల్లసాని పెద్దన కవి

"నావాడపతి శకందరసింధురాధ్యక్షు
లరిగాపు లెవ్వాని ఖరతరాసి"

అని సగర్వముగ పాడుచున్నాడు. ఇవి మహారంభములును, వారు మహాకవులును.

## దేశభక్తి: భావకవులు

ఈశ్వరేచ్ఛచే మనజాతిజీవితమునం దిట్టిమహోద్యమవాయువులు నేడు వీచుచున్నవి. ఇవియే ఆధునికకవిత్వసౌరభమును మనకు గొనివచ్చుచున్నవి. నేటి కవులయందు ప్రథమస్మరణీయమైనది వారి నిశ్చలదేశభక్తి. విజయపతాకము లెగురుచుండ స్నిగ్ధగంభీరఘోషముతో వెడలు మాతృరథ

సన్నాహమునకు వారుద్రేకపూరితులై స్వాగత మిచ్చు చున్నారు.

దువ్వూరి రామిరెడ్డిగారు

"అంబుదంబుల నమృతపూరంబు లొలుక
నింద్రచాపంపుతోరణ మింపుగులుక
కాంతిమెఱుగులు నెల్లెడ గడలుకొనగ
వెడలె స్వాతంత్ర్యరథము విన్వీథియందు.

జలధరమాలజీల్చికొని స్యందనకాంతి నభోంతరాళము
జ్వలితముచేసి యంధతమసంబులు వారినమూలనై నశో
భల ననలెత్తజేయుచు, బ్రభాతవిభాకరబింబమట్లు సొం
పిలుచు నవీనజీవనము వింతగ నింపె సమస్తసృష్టిలోన్."

—"స్వాతంత్ర్యరథము"

ఈ నూతనయుగముయొక్క మహాదాదర్శములను ధ్వనించు నీపదముల గనుడు.

రాయప్రోలు సుబ్బారావుగారు

"మబ్బులే లేవు చూడు! విమానవీథి
ఆశ లాదర్శసీమల నంటనల్లె,
క్రమ్మియున్నది క్రొత్తరాగమ్ము భువిని,
నవనవకుతూహలప్రసూనములు పూచె,
చీకటిముసుంగుద్రోసి హాసించుచున్న
దదిగో! మంచులతెరలకు నవల నిలిచి
యొకపవిత్ర తేజోబింబ ముజ్జ్వలాంశ

చూడబోవుచున్నారు తోడిచెలులు
లేచిరావమ్మ! మాతల్లి! లేచిరమ్మ!"

—"తెనుగుతోట."

తుచ్ఛమైనభోగము లాసించి నీచదాస్యమునకు దొర కొనుటకంటె యుజ్జ్వలమరణ మాకాంక్షనీయమని ప్రబోధించు చున్నాడు వేదుల సత్యనారాయణగారు.

"కానుకనై ధరాధిపుల కాళ్లకడం
బొరలాడి వాడిపోలేను; ధరాపరాగపటలీ
మలినమ్మగుద్వారతోరణాస్థానమునం
దురిం బడగజాలను...........

నీచపుదాస్యవృత్తి మననేరని శూరత మాతృదేశ సే
వాచరణమ్మునం దసువు లర్పణసేసినవారి పార్థివ
శ్రీ చెలువారుచోట, పదనృగుక్చుల న్వికసించి వాసన
ల్వీచుచు రాలిపోవగవలెం దదుదాత్తసమాధిమృత్తికన్."

—"కాంక్ష"

దేశముయొక్క వర్తమానోద్యమములందును, భావి భాగ్యోదయమునందును నేటికవుల కెంత యార్గ్రావ్యమున్నను సంకుచితమతులవలె మనజాతియొక్క తొల్లింటిశౌర్యాగ్నిని, జ్ఞానవైదగ్ధ్యమును మరువక, అడుగడుగునకు స్మరించుచు, తమ శిల్పచాతుర్యముచే పునఃసృష్టి నొందించి సజీవములుగ జేసి మన కనిర్వచనీయానందమును గూర్చుచుండుటచేతనే వీరు

నిజముగ జాతీయకవు లనుపూర్ణనామమున కర్హులగుచున్నారు. "రుచిచకితమై" సముజ్జ్వలమైన కవిమనోవీథియందు మెరుపు వలె మెరసిన యాంధ్రజాతిపూర్వప్రతిభను వర్ణించుచు విశ్వనాథ సత్యనారాయణగారు:

"ఏ రాజు పంచెనో యిచట శౌర్యపుపాయ
సమ్ములు నాగులచవితినాళ్ల
ఏ మెట్టసంజలో నెలమి పల్లవరాజ
రమణులు కాళ్ళ బారాణు లిడిరొ
చిత్రరథస్వామిశ్రీరథోత్సవములో
తెలుగుపిల్లలు కత్తి త్రిప్పి రెపుడొ
ఏ రెండుజాములయినుని వేడిమి వచ్చి
కలిసిపోయెనొ త్రిలింగప్రభువుల

నా జగచ్ఛ్రేయసంబులై యలరు తొంటి
వేంగిరాజుల పాదపవిత్రచిహ్న
గర్భితంబైన ఈ భూమిఖండమందు
నశ్రువులు జార్త్రు జీవచ్ఛవాంధ్రజనులు"

అని తొల్లిటి మహోన్నతదశకును, నేటి నికృష్టదశకును గల వ్యత్యాసమునకై వగచుచున్నాడు. అంతలో తనకల్పనా సామ్రాజ్యమందు తన్మయుడై ఆ జ్యోతిర్మయసీమలందు జరించు నొకవ్యక్తిగా తన్ను నిర్మించుకొనుచున్నాడు.

"ఈ పొదలం జరించుచు నహీనమహామహిమానుభావమా నే పురవీథులందొ చరియించుచునుంటి నటంచు పారతం

ర్త్యాపతితుండ నయ్యును పురామహాంధ్రమునఁ స్వతంత్రుఁడౌ
నే పురుషుండనో యనుచు నీభ్రమ సత్యముగా దలంచుదుఁ."

ఇట్లు తన్మయుడై కవి తనయుద్వేగాగ్నిచే యువకుల
శౌర్యవహ్నిని రగుల్కొల్పుచున్నాడు.

"వేగిరాజ్యపు పల్లెవీథుల చెడుగుళ్ళ
రిపుల గవ్వించు నేరుపులు తెలిసి
ఎగురుగోడీబిళ్ళసాగసులో రిపుశిర
స్సుల బంతులాడు శిక్షలకు డాసి,
చెక్కాడి యుప్పు దెచ్చిననాడె శాత్రవ
వ్యూహముల్ పగిలించు నోరపు గరచి,
కోతికొమ్మచ్చిలో కోటగోడల కెగ
బ్రాకి లంఘించుచంక్రమణ మెఱిగి
తెలుగు లంతప్డై యవి నేర్చుకొనియయుందు
రెన్నగా తెల్గుతల్లులు మున్ను శౌర్య
రస మొడిచి యుగ్గుపాలతో రంగరించి
బొడ్డుకోయనికూన కే పోయుదురట!"

—"వేగిక్షేత్రము."

ఈ కవియొక్క సత్యమైన క్రోధాగ్నిలో నేటి హీన
దశకన్న నఖిలాంధ్రభూమి తెనుగునదుల పరిశయన ర్తనమందు
లయించుట మేలు.

"ఇచటి నాగావళీ ప్రచురవర్షాంభ స్త
రంగముల్ వంశధారాజలములు

తరగెత్తిన మహేంద్రితనయాసుపాథస్సు
లోకసారిగా పొంగి యుబికిపోయి
గౌతమీకృష్ణవేణీతరంగములు తా
రాధ్యమ్మునందు నైక్యము భజించి
గుళ్లకమ్మజలాలగుబురులో గుబురులై
పెన్నతరంగముల్ పెరిగిపోయి
తెలుగునదులెల్ల పొంగెత్తి ప్రళయవారి
కెరలిపడి తెల్గునేల ముగించనిమ్ము
నేటితో; నస్వతంత్రితానియతమైన
ఈబ్రతుకు తెల్గువారు భరింపలేరు."

—"ముఖలింగము."

మఱియు నగ్నికణము లురలు జాతీయఘట్టములకై "ఆంధ్రిపౌరుషము" "కొండవీటి పొగమబ్బులు" మున్నగు ఖండకావ్యములు పలుమారు చదివి మననము చేయుడు. పై నుదహరించిన కవిత్వపువెల్లువయందు ఓజస్సనుగుణము ప్రాధాన్యము నొందినదని గ్రహించనగును. దీనినే ఆంగ్లమందు Majesty అనియు, Sublimity అనియు చెప్పవచ్చును.

ఇట్టి కవిత్వమును మహాకవులరచనలతో పోల్చిచూచుకొన్న నేటికవిత్వమం దట్టిగుణములు పాదుకొన్నవా, లేవా యని యెఱుగనగును. సహృదయునకు రసాస్వాదనశక్తి సహజము. మెరుగు లెరుంగుటయందు నలిగిన చెవియే యూతనికి సాధనము. పూర్వకవుల గొప్పరచన లను గీటురాయిమీద నేటి కవిత్వమును రాచిచూచి విలువయెఱుంగుట మరియొక

మార్గము. అది మేలిమిబంగారమో, కత్తీయో, ఉన్నతకవిత్వమో, కవిత్వాభాసమో అనభ్యస్తునికైన విశద మగును. విరాటపర్వమునందు సింహబలుడు ద్రౌపది నవమానించిన రంగములో భీముని ప్రళయోగ్రానలసన్నిభంబగు కోపాటోప వర్ణనమును, అందు ముఖ్యముగ

సీ. నేలయు నింగియుఁ దాళముల్ గాఁజేసి
యేపున రేఁగి వాయించి యాడఁ
గులపర్వతంబులు గూల్చి యొండొంటితోఁ
దాఁకంగ వీఁకమైఁ దన్ని యాడ
నేడుసాగరములు నిక్కడక్కడఁ బెట్టి
పలుచనిరొంపి మైఁ నలఁది కొనఁగ
దిక్కులు నాలుగు నొక్కచోటికిఁ దెచ్చి
పిసికి పిండలి సేసి పిడుచగొనఁగ
తే. మిగిలి బ్రహ్మాండభాండంబు పగులవేయ
నప్పళించుచుఁ బ్రళయకాలానలమున
గండరించినరూపంబుకరణి భీముఁ
డతిభయంకరాకారత నతిశయిల్లె.

అను సీసపద్యమునందలి యారోహణశైలిని పోల్చి చూడుడు. ఆధునికకవిత్వము పేలవమని చెప్ప సాహసించువారింకను నుందురా? విశ్వనాథకవియొక్క ప్రచండభావాగ్నికట్టెదుట బిభీషకుఁ బెదరుగొన్న బాలకులవలెనున్న మిమ్ములను మఱియొకమధురవాణి తల్లివలె నాశ్వాసించుచున్నది.

"తనగీతి యరవజాతిని పాటకులనుగా
దిద్దివర్ధిల్లిన తెనుగువాణి,
తనపోటులు విరోధితండంబులకు సహిం
పనివిగా మెరసిన తెనుగుకత్తి,
తనయందములు ప్రాంతజనుల కభిరుచివా
సన నేర్ప నలరిన తెనుగురేఖ,
తనవేణికలు వసుంధరను సస్యశ్యామ
లను జేయజెలగిన తెనుగుభూమి,
అస్మదార్ద్రమనోవీథి నావహింప
జ్ఞప్తి కెలయించుచున్నాడ చావలేదు
చావలేదు ఆంధ్రులమహోజ్జ్వలచరిత్ర
హృదయములు చీల్చి చదువు డో సదయులార."

—రాయప్రోలువారి "ప్రబోధము"

ఈ వాక్యములు మీ మనోగతభయములను వారించి, ఆత్మవిశ్వాసమును పురిగొల్పి భావియౌన్నత్యమును ధ్వనించుచున్నవి.

## క వి త్వ త త్వ ము: భా వ క వి

ఆధునికకవిత్వము ఔదార్యమునందును, మాధుర్యమునందును మనపూర్వకవుల వెల్లగొడుగునకు నీలిమ నాపాదించలేదని మీ రిప్పుడు చూచియున్నారు. కవికర్మనుగురించియు కవిత్వబీజమైన కవిప్రతిభనుగురించియు నేటికవులయభిప్రాయము లమూల్యములు. కవిత్వమనగానేమి? సంఘజీవితమునందు

కవిత్వమున కెట్టిస్థానముగలదు? కవియాదర్శము లెవ్వి? అను మనోహరసమస్యల కుత్తరములు నేటికవిత్వమందు దొరకు చున్నవి. ఉదరపోషణార్థము కవిత్వాచ్ఛాదన మను పామరాభిప్రాయము వీరి కెంతమాత్రము రుచించదు.

"కమ్మనిగ్రంథంబొక్కటి
యిమ్మనగ నేనృపతికైన యిచ్చినచో గై
కొమ్మని యీరె ధనమ్ముల
నిమ్మహి దున్నంగనేల యిట్టిమహాత్ముల్"

అను చాటూక్తి నేడు నర్తించదు. కవిజీవితముకన్న ఉత్కృష్టపదవిలేదని తలంచుచున్నారు బసవరాజు అప్పారావుగారు:

"కవియనికీర్తిని
గాంచుటకన్నను
ఘనమేమున్నది
జగతిని ?
ప్రణయవేదనల
పాడుటకన్నను
పరమామోదం
బేదిరి?
సౌందర్యోపా
సనమునకన్నను
సద్వ్రతమెయ్యది
చెప్పుమా ?"

ఉత్తమతరగతికవియొక్క లక్షణము లివి. అతడు ప్రణయ వేదనల పాడును. సౌందర్యము నుపాసించును. సౌందర్యము నారాధించుట సత్యము నారాధించుట:

' Truth is Beauty and
Beauty is Truth '

అని కీట్సు అను కవికుమారుడు వచించెను.

సౌందర్యోపాసకులైనకవులు ఈశ్వరునే యుపాసించు చున్నారు. కవులు నిరంకుశులు. సత్కావ్యము జీవితవిమర్శ యను సూక్తిమేరకు కవులు సమకాలికజీవితపరిబంధము నన్వయించువారైనప్పటికిని నిజముగ కవికర్మ దేశకాలపాత్రభేదముల కతీతమైనది. కవిని శృంఖలాబద్ధుని చేయజూచుట వ్యర్థము. స్వేచ్ఛయే యాతని నానాగ్రములందలి యూరుపు. దేవులపల్లి కృష్ణశాస్త్రిగారు స్వేచ్ఛాగాన మను ఖండకావ్యమం దీయాశయమునే ప్రకటించుచున్నారు

"తిమిరలత తారకాకుసుమముల దాల్ప
కర్కశశిలయు నవజీవకళల దేర
మోడుమోక చివురులెత్తి మురువు సూప
జగమునిండ స్వేచ్ఛాగానఝరుల నింతు.

క్రౌర్యకౌటిల్యకల్పితకఠినదాస్య
శృంఖలములు తమంతన చెదరిపోవ
గగనతలము మార్మ్రోగగ కంఠమెత్తి
జగమునిండ స్వేచ్ఛాగానఝరుల నింతు."

మరియు

"నవ్వియోదురుగాక నాకేటిసిగ్గు
నాయిచ్ఛయేగాక నాకేటివెరపు"

అని కవికి తన ఆవేశమే, తనయిచ్ఛయే ప్రధానము గాని పెరవెరపులులేవని ఘంటాపథముగ చెప్పుచున్నారు.

కవిత్వముయొక్క సొగసుదనము చెప్పరానిది, అంటరానిది, చూపరానిది—ఈశ్వరతత్వమువలె.

"యతో వాచో నివర్తంతే అప్రాప్య మనసాసహ."

మాటలలో ఇదమిత్థమని వర్ణింపరానిది. కవివ్యాపారము శిల్పియొక్క ఉలిచెక్కు నేర్పువంటి దని తిక్కన వచించెను. ఈ యనిర్వచనీయమైన కవిత్వమహత్వమును పింగళి సూరనకవి ఇట్లు నిర్వచించెను.

లయవిభాతి

"చలువగల వెన్నెలల చెలువునకు సౌరభము
గలిగినను సౌరభముఁ జలువయుఁ దలిర్పం
బొలుపెసఁగు కప్పురపుఁబలుకులకుఁ గోమలత
నెలకొనిన సౌరభముఁ జలువపసయుం గో
మలతయునుగలిగి జనముల మిగులపెంపెసఁగు
మలయపవనంపుఁగొదమలకు మధురత్వం
బలవడిన నీడు మఱి కలదనఁగవచ్చుఁ గడు
వెలయఁగల యీసుకవిపలుకులకు నెంచన్."

ఈ యవర్ణనీయవస్తువునే హృదయంగమమగు మంజులవాక్సరణిలో తేనెబిందువులను వలె స్రవించు నీకవిత్వధోరణిని గనుడు.

సీ. "చూతురా! దీనిని చూతపల్లవఖాది
ని పికాంగనాగానవిస్వనంబు
కొందురా! దీనిని కొమ్మెరుంగులజిల్గు
పనికిగాదగిన కుందనపుదళ్కు
కావలెనా? యిద్ది కలువపూరేకు పో
త్తముల జిప్పిలెడు మెత్తందనమ్ము
వలయునా? మలయపర్వత సానువులనుండి
దిగుమతియగుకమ్మ తెమ్మెర లివి
తే॥ తీయుదుర? దీని వెన్నెల తేటనిగ్గు
ఒరయుదుర ? దీని బచ్చ కప్పురపుడావి
కోరికొందురా ? దీని బటీరజలము
త్రావిచూతురా ? తీయనిపూవు దేనె."

పింగళి లక్ష్మీకాంతం
కాటూరి వెంకటేశ్వరరావుగార్లు

—"కవితాసామగ్రి"

కవి ఉద్విగ్నమానసుడు. ఆతని యావేశము "ఇసుక పొరలు చీల్చుచు పొంగులెసగ బొరలు పొడుపుటేళ్ళ తుళ్ళింత" వంటిది. కవితావేదన పచ్చిబాలెంతరాలి స్తన్య వేదనవంటిది. కవిహృదయమందు కదలించిన భావపరంపర వాణియై వెడలువరకు నాతనికి శాంతియనునది దుర్లభము.

"గుండె గొంతుకలోన కొట్లాడుతాది
కూకుండనీదురా కూసింత సేపు"

—నండూరి సుబ్బారావుగారు.

కవి తనయొక్క మానసికావస్థయందు మహాయోగి వంటివా డని విశ్వనాథ సత్యనారాయణగా రనుచున్నారు. కవి సామాన్యమానవుల కందరాని యూహాసీమల విహరించుచు, "అలవైకుంఠపురంబులో నగరిలో మందారవనాంతరామృత సరఃప్రాంతేందుకాంతోపల వేదికపై" ధ్యాననిష్ఠ నవలంబించి, స్వమనోకల్పితసువర్ణకల్లోలినిలో మునిగిపోవును.

నే ను

"ఓయి నటకుడ! ముక్తి కెట్లూహ సేతు
వేది యాలంబనముగ గ్రహించినావు ?

న ట కుఁ డు

నా వదనరేఖలందున నాట్యమాడు
నీ ప్రపంచము, దాని గ్రహించినాను.

నే ను

ఓయి చిత్రకారుడ! నీదు నూహ లేమి
ఏది యాలంబనముగ గ్రహించినావు?

చి త్ర కా రుఁ డు

నాకరాగ్రపు కుంచెలోన జనియించె
నేరసాకృతి యామె గ్రహించినాను.

నే ను

నిన్ను సైతమ్ము మఱల ప్రశ్నించుచుంటి
నో కవీ! ముక్తి గూర్చి నీయూహ లేమి?

క వి

నిశ్చలంబుగ నన్నుండ నీవ యేమి
పరమ యోగిని న న్నేల పలుకరింతు?" —ముక్తి

కవియొక్క ప్రతిభాత ప్తమైన మనోంబరమందు అణువు మొదలు బ్రహ్మాండమువరకు ప్రతిఫలించి తమ భౌతికవికల స్వరూపములను, కంబళిపురుగు తొంటివికారరూపమును జార్చి సీతాకోకచిలుకవలె తయారయినట్లు, విదల్చి మనోహరాకృతితో వెల్వడును. ఈవిశ్వరంగమే వాగర్థపరిణయముతో తొణుకుచున్నట్లు రాయప్రోలువారికి స్ఫురించుచున్నది.

"అణువు నజాండము నేకస
రణి నిండారిన మనోహరపువాగర్థ
పరిణయము గీర్తించెడు మృదు
గుణులను భాషాకుమారకుల నుతియింతున్."

వీరి కవిత్వనౌకకు తారకలు దిశలుసూపును. ఆనావ స్వేచ్ఛావిహారిణి.

"లేదులేదు నిర్బంధపాలితపథంబు
నా సువర్ణతరణి కీవిలాసమణికి."

—"శుక్తి"

ఈ ప్రపంచరహస్యములను మాత్రమే లోకమున కన్వయించిచెప్పుటతో తృప్తినందక

"సభూమిం విశ్వతోవృత్వా
అత్యతిష్ఠ ద్దశాంగులమ్"

అను ఛందోనిగదితమైన స్వర్ణసీమలతో సుఖ దుఃఖమయమైన మన భూలోకమును కవితాసేతువుచేత గలుపవలెనను పేరాసగలవారు పింగళి లక్ష్మీకాంతం, కాటూరి వెంకటేశ్వర

రావుగార్లు. ఆయజ్ఞాతసీమయొక్క ఎల్లలు జీవితపరిబంధాంతమునుండి మొదలగుచున్నవని షేక్స్పియరు (Shakespeare) మహాకవి యూహించుచున్నాడు.

Who would fardels bear
To grunt and sweat under a weary life,
But that the dread of something after death
The undiscovered land from whose bourn
No traveller returns—puzzles the will—
And makes us bear the ills we have
Than fly to others we know not of.

—HAMLET

"ఎవరునీవు" అను సరిలేని ఖండకావ్యమునందు ఈ పేరాస నిట్లు కవులు వర్ణించుచున్నారు.

"..........................నన్ను
గారడియొనర్చి యీ యబ్ధితీరమునకు
నిటుల వెలయించుకొని వచ్చి యెగిరిపోయి
అవలియొడ్డున నిల్చి నన్నటకు బిల్తు
నీవటనెయుండు మిద్దరి నేను నిలుతు
నిరువురము జేతులనుగల్పి యీమహాబ్ధి
పైన సేతువు నిర్మింపవచ్చు మనము.
అవలియొడ్డున నీవు నే నివలిదరిని
నిలిచి తీరద్వయరహస్యములను జలధి
గర్భమును మార్వలుకునట్లు గానములను
సలిపి యిద్దరినద్దరి కలుపవచ్చు."

ఒక యనన్య క్తవ్య క్తి eternity, అనగా కల్పాంత కాలపు టవలికొనను, అజ్ఞాత సీమయంచుల నిలువబడి కవులను తన వద్దకు పిలుచుచున్నది. షేక్స్పియరు మహాకవివలె వీ రాయ గమ్యవిశ్వ ఖండములను జేరుటకై వెరవరు. ఇంతేగాక మేరు నీరులవలె కాకులు కూయని కారడవి, చీమలుదూరని చిట్టడవి యైన యా ప్రదేశమును మనకు నిత్యపరిచితమైన యీ మనో హరభూమితో కలుపుటకై కవిత్వ మను సేతువునిర్మించి మనకు సుగమమార్గమును గల్పించుచున్నారు. ఇంతకన్న కవిత్వమున కుత్కృష్టాదర్శ మేదికలదు ? కావున హిమాలయమువలె సమున్నతమును, జలధిగర్భమువలె గభీరమునైన ఆశయము లతో చెన్నారు భావకవిత్వము ఆంధ్రులకు జాతియున్నంత వరకు మరువరానిదని చెప్ప సాహసించుచున్నాను.

## ప్రకృతి - భావకవులు.

భావకవి ముఖ్యముగ ప్రకృత్యారాధనపరుడు. ప్రకృతియే యాతనిదైవము, తల్లి, తోడు, నీడ, మిత్రము, కళత్రము. భావకవిత్వమున కీప్రకృత్యారాధన విశిష్టలక్షణము. పూర్వ కవులయందు ప్రకృతివర్ణనలు లేకపోలేదు. కాని వారు ప్రకృతిచిత్రముల నానుషంగికముగ వర్ణింతురుగాని తల్లీనులు గారు. వారు ప్రకృతిని పాత్రములకు భిన్న మయినదిగా దర్శింతురు. దీనిని ఇంగ్లీషులో objective view అని చెప్పె దరు. భావకవి ప్రకృతిలో లీనుడై ప్రకృతిలో సుఖదుఃఖముల జూచుచు, తన సుఖదుఃఖముల ప్రకృతితో నన్వయించుచు, ప్రకృతిని తన దానినిగా, తల్లిగనో, కళత్రముగనో, మిత్రము

గనో కల్పించుకొనుచు తన కభిన్నమైన దానినిగ స్వీకరించు చున్నాడు. దీనినే మనము ఇంగ్లీషులో subjective view అని చెప్పుకొనుచున్నాము. ఈ అంతరదృష్టి ప్రకృత్యారాధన మందే గాక భావకవి తన కవితావ్యాపారమునం దంతటను బరపుచున్నాడు. అంతర్ముఖమైన ఈతని దృష్టికి దన ప్రణయము, తన ఆశయములు, ఉత్సాహము, నిరాశ ఇవన్నియు కవితావిషయము లగుచున్నవి.

కావుననే భావకవియొక్క భావ మొక్కొక్కప్పుడు ఆకుల చాటు సుమమువలె తొంగిచూచుచు అశ్రద్ధధానునకు కనుమరుగుగా నుండును. పూర్వకవులదృష్టిపథము బాహిర మగుటచే కఠినపదభూయిష్ఠమైనప్పుడు గూడ ఆపదభారము తొలగించినచో భావము సుగమమై దొరకును. పూర్వకవులు అన్యవస్తువులరహస్యములను, అన్యవ్యక్తుల జీవితనాటకములను చిత్రించుటయందు రక్తులు. భావకవికి ఆత్మయే బిందువు. ఈ బిందువునుండి విశ్వవృత్తమునాతడు గీసికొనును. ఈబిందువు నుండి యాతని కవితారేఖలు బ్రహ్మాండవృత్తము యొక్క పరిధివరకు వ్యాపించును. పూర్వకవియొక్క నామరూప రహస్యములు మన కవిదితమైనను ఆతనికావ్యముల మన మన్వయించి యానందింపగలము. భావకవియొక్క జీవిత యవనిక తొలగించి చూడక మన మాతని కృతియందలి రస మును సమగ్రముగ నొక్కొక్కప్పుడు చర్వణ చేయజాలము. ఇందుల కాతని నిందించుట బాల్యచాపల్యము. మహాయోగికి వలె భావకవికి "ఆత్మైవ బంధు రాత్మనః"

ఆ యాత్మలో విలీనుడై సృష్టిరహస్యముల నచ్చటనే గాంచి వానితత్త్వము నూహించును. ఇదియొక కవితాసీమ. దీనిని Subjective Poetry అని చెప్పుకొందుము. అంతర్ముఖ కవిత్వము తేనెపట్టువలెనుండును. బహిఃకాఠిన్యము కాన్పించదు. కాని తేనెతెట్టును పిండితేగాని తేనెయొలుకదుగదా! బహిర్ముఖ కవిత్వము నారికేళమువంటిది. కవి పాండిత్యప్రకర్ష యను చిప్పను పగులగొట్టగానే రసము భూమిమీద ఒలుకును.

భావకవి బాలకునివలె ప్రకృతివెంట పరుగెత్తును.

"ఉ. ఆకటిప్రొ ద్దెరుంగక సహాయులగూడక రేయినాక పై
నాకసమందు తోచెడి శశాంకుడు చుక్కలె తోడుగాగ ని
శ్శోకతముండి నిశ్చలత నేదియొ యోచన మున్గియున్న వ
త్సా!....................................."

పింగళి లక్ష్మీకాంతం
కాటూరి వెంకటేశ్వరరావుగార్లు —"కవిశిశువు."

నిర్జీవమైన మానవప్రపంచమునుండి పారిపోయి ప్రకృతిగర్భములోనికి జొచ్చుకొని పోవలెనను కృష్ణశాస్త్రిగారి తొందర చూడుడు.

"ఆకులో ఆకునై పూవులో పూవునై
కొమ్మలో కొమ్మనై నునులేతరెమ్మనై
ఈయడవి దాగిపోనా

ఎక్సైన
నిచటనే యాగిపోనా ?

గలగలని వీచు చిరుగాలిలో కెరటమై
జలజలని పారు సెలపాటలో తేటనై
ఈయడవి దాగిపోనా ! ”

ప్రకృతిగర్భనిభృతుడైన కవికి జీవితపునిత్యకృత్యములు
ప్రమసిపోయినవి.

‘ఆకలా! దాహమా! చింతలా! వంతలా!
ఈకరణి వెక్కినై యేకతమ తిరుగాడ
ఈయడవి దాగిపోనా
ఎక్సైన
ఇచటనే యాగిపోనా !’

—‘కృష్ణపక్షము’

ఒక్కొక్కప్పుడు ఈకవి ప్రకృతితో బాల్యఖేలన
మొనరించును.

‘తెలిమబ్బు తెరచాటు చెలి చందమామ
జతగూడి దోబూచి సరసాలనాడి
దిగిరాను దిగిరాను దివినుండి భువికి
నవ్విపోదురుగాక నాకేటిసిగ్గు ?’

లలితమనోహరమును ఎడనెడ ప్రళయకాలమహోగ్ర
భయదజీమూతసదృశమునైన ప్రకృతి రెండిటను ఈ కవికి
తన్మయానంద మొసగును

'ఏను స్వేచ్ఛాకుమారుడ, నేను గహన
పథవిహారవిహంగమపతిని, నేను
మోహనవినీలజలధరమూర్తి నేను
ప్రళయఝంఝూప్రభంజనస్వామి నేను'
— 'కృష్ణపక్షము'

ఒక్కొక్కప్పుడు దుఃఖితుడై నతనకు ప్రకృతిలో సమాన ధర్మత్వము వెదకికొని యాశ్వాసమందును.

'ఎంతబరు వయ్యెనో కాని యెడద వెలికి
తొలగి పారనిదుఃఖాశ్రుజలమువలన
ప్రావృడంభోధరస్వామి ! నీవుకూడ
నావలెనె జాలివొడమ వాపోవుచుంటి'

మరొక్క కవికుమారుడు ప్రకృతిమాతయవయవా లంకారములలో నేదోయొక దానిక్రింద పుట్టక మనుష్యజన్మ మెత్తి ప్రకృతికి దూరమైపోతినేయని మనోహరనిర్వేద మొందుచున్నాడు.

"సాంధ్యకిమ్మీరపర్ణవస్త్రముల దాల్చి
గిరితటవిహారశృంగారకేళి సొలసి
రమణ జరియించుజలధరార్భకునిగాగ
నేల సృజియింపడో నన్ను నీశ్వరుండు?

ప్రత్యుషాశ్లేషమున విచ్చు ప్రసవమందు
దరుణసూర్యాంశుమాలికాతరళకాంతి
మిళితమై రాలు తుహినాంబుకళికగాగ
నేల సృజియింపడో నన్ను నీశ్వరుండు?

యామినీవ్యోమమండలప్రాంగణమున
గవి మనోనందరాజ్యంబు గాంచువేళ
గాంతివెదజల్లు నక్షత్రకంబుగాగ
నేల సృజియింపడో నన్ను నీశ్వరుండు!"

"నక్షత్రమాల"

—దువ్వూరి రామిరెడ్డిగారు

ఇంకొక కవిబాలుని ప్రకృతిమాత కన్నప్రేమతో తన కడకు బిలుచుచు రాత్రులందు తన యంకముపై నిడి జోల పాడి నిదురబోగొట్టును.

"అరుణరాగము నొరసికొనుచు
సరసిజాప్తుం డుదయశైలాం
తరమునం దెసగంగ నన్నట
కరుగ బిలిచెదవు.

కవికుమారులు భావగీతా
రవళిలో మగ్నంబు నొందుచు
భువి మరచి తన్మయత జెందగ
బొంగిపోయెదవు

జనులు నిద్రాసక్తు లగుచును
దనుల మరచి సుషుప్తి జెందగ
లాలితములగు వేణురవముల
జోలబాడెదవు."

—పెనుమర్తి వెంకటరత్నముగారు.

ఈకవి బాల్యమునందే ప్రకృతిలో విలీనుడై పోయెనట!

మరియొక సాహసికకవికి ప్రకృతిభయంకరదృశ్యములు క్రీడారంగములుగా దోచును.

"భూకంపమున కులాచలములు ఘూర్ణిల్లనీ! అగ్నిపర్వతములు పగిలిపోనీ! ఆభీకరసమయములో నేనొంటిగ ప్రపంచము వెలుపల గూర్చుండి ప్రకృతికన్యకతో ఆడుకొందును."

—మునిమాణిక్యం.

ప్రకృతిసందేశము ప్రపంచమున కన్వయించుట మరియొక కవికి సహజానందము.

"నది:—స్వేచ్ఛతో ప్రవహించుట నాకు సహజం.

పువ్వు:—ఆత్మసమర్పణబుద్ధితో సౌరభముల నల్లడల జిమ్ముట నాకు సహజం.

చందమామ:—అనునయబుద్ధితో చల్లనికాంతుల నెల్లెడల జల్లుట నాకు సహజం.

కవి:—మీ మీసందేశములను లోకమునకు తెలియజెప్పడం నాకు సహజానందము."

మరియొకప్రకృతికుమారుడు సృష్టిలోని వికటదృశ్యములకు బెగడొందుచున్నాడు. రాహువు గ్రహణవిపత్తునం దగిలిన చంద్రునికై వగచుచు, ఉషఃకాలమందు గడ్డిపోచచివరగాలిలో తటతటలాడుమంచుబిందువు వలె వేపమానహృదయుడై బసవరాజు అప్పారావుగారు "రాబోకు రాబోకురా చందమామ" అనుపాటను పాడియున్నారు.

'రాబోకు రాబోకురా చందమామా!
రాహు పొంచున్నాడురా తోవలోన!

ఆకొక్కపైనాను
అల్లాడకున్నది
మబ్బులపై నేదో
మాయ కప్పేసింది రాబోకు॥

తెల్లన్ని నీకాంతి
నల్లనయ్యేనురా
చల్లన్ని నీమోము
సన్నగిల్లేనురా రాబోకు॥

పరమరాకాసిరా
పాపిష్టి రాహువు
మిత్తిలా నిను బట్టి
మింగబోయ్యేనురా' రాబోకు॥

ప్రబంధకవిత్వములోని నాయికానాయకుల కృతక చందోప్రాలంభనమును, ప్రకృతిదృశ్యముల నుద్వేగము చేతను కంపించు హృదయముతో ప్రదర్శించు నీపాటను పోల్చి చూడుడు.

ప్రకృతిని మాతృపీఠికకెత్తి హారతిచ్చిన రాయప్రోలు వారి స్వప్నకుమారమును చదివి యానందింపుడు.

ప్రణయినీవియోగజనితాయాసమున నొక కవికుమారుడు నిద్రించ స్వప్నమం దొక్క రమణి యాతనిమనోవీధిలో నడయాడజొచ్చెను. కుమారుడు మోహపరవశు డయ్యెను.

'కాంతరూపమె రసవదాకర్షణంబు
అందు సంవృతశృంగారముం దొలంకు
ముద్దు వేస మత్యంతసమ్మోహనంబు
కృష్ణనిశలసాంగత్య మిం కేమిచెప్ప!'

ఆశలెల్ల గ్రీష్మప్రవాహములపగిది శోషిల్లినయాతని హృదయమందు రాగమృగతృష్ణ లడరెను. ఆ స్వాప్నికభువనవాహినితో 'సా_ప్తపదీనమైత్రి' గోరెను.

'పూలుగుర్చినసంపూర్ణపుణ్యశీల
వేని నను జూచి ప్రేమింపు మిందువదన
మాలికలుదెచ్చినయభాగ్యురాల వేని
రమ్ము పోద మీహతమనోరథునితోడ.'

ఆకాంత యిట్లు ప్రత్యుత్తరమిచ్చెను:

'పూలు పూయింతు సంపూర్ణముగను గాని
గుర్చుభాగ్యము దెల్పెడు ఘోషగూడ
గాంచుచుందును.—'

ఈకాంత యెవరునుగాదు. ప్రకృతికాంతయే, మోహావేశమున నాతడుదరియబోవగా నామె దూరదూరముగ బోయెను.

"క్షీణచంద్రికలను ప్రకాశించు రేయి
నాకు గాటుక పూసెనో నాగ దోఁచె
మెరపు మెరసినట్లైన వెల్తురున గంటి
నడుగులు గదిల్చి పోవుచున్నట్లు సతిని."

తుదకు సత్య మాతనిమనంబున వెలింగెను. 'అమ్మా!' యని దరియబోయి కంఠము కౌగిలించెను. ఇదియే ప్రకృతి గర్భమం దిమిడియున్న రహస్యము. ప్రకృతి మనుజునకు మాతృస్థానమం దాసీనురాలైనచో తనయుల నిట్లు వియోగదుఃఖానలముచే వేచనేల? యనుప్రశ్నవచ్చును. కాని ప్రకృతినియమములలో పూలు పూయించుటయు మాలలు త్రెంచుటయు కూడ గలవు.

'కాటియందలిధూమాంధకారభరము
పడకటింటికర్పూరదీపపుమెఱుంగు'.

ఈ రెండును మాతృకల్పితములే. ఎందు కిట్లున్నవని సందేహాపరు లడిగినచో,

'పొదుగు నొవ్వంగ బాధించుముద్దులేగ
నొడలు నాకెడి గోసాధ్వియో ర్పదెంతో
బాధ సళుపరించినగాని స్వాదువైన
ప్రేమమాధుర్యము రుచింప దేమొ పుత్రి!'

అని ప్రత్యుత్తరము. ప్రేమయొక్క మహత్వమును తెలిసికొనుటకు కొంత బాధపడుట తప్పదు.

## ప్రేమ - ఆధునిక కవులు

ఆధునికకవిత్వమునందు పడుగుపేకవలె అల్లుకొనిపోయి భావకవిత్వవల్లికకు జీవనసుధయై పారునది ప్రేమవాహిని. ప్రేమతత్త్వవిచారమే నేటిగొప్పకవులందరు తమముందుంచుకొన్న సమస్య. సృష్ట్యాదినుండి నేటివరకు పిపీలికాదిబ్రహ్మపర్యంతము వస్తువుల నన్యోన్యాకర్షణ మొనర్చి ఒక్కొక్కచో నానందమును ఒక్కొక్కచో దుఃఖమును గూర్చుచు ముఖ్యజీవసూత్రముగ ప్రపంచకవు లందరిచేతను ఆదరింపబడినది ప్రేమయేగదా! ఈ యన్యోన్యాకర్షణశక్తినిగూర్చి మహాకవి భవభూతి యిట్లు వచించుచున్నాడు.

శ్లో. "వ్యతిషజతి పదార్థానాంతరః కోపి హేతు
ర్న ఖలు బహిరుపాధీన్ ప్రీతయః సంశ్రయంతే
వికసతి హి పతంగస్యోదయే పుండరీకం
ద్రవతి చ హిమరశ్మావుద్గతే చంద్రకాంతః."

ఈ ప్రేమగుణము కృష్ణశాస్త్రిగారికి కడు సహజమైన ప్రకృతినియమముగా దోచుచున్నది.

"సౌరభము లేల జిమ్ము పుష్పవ్రజంబు
చంద్రికల నేల వెదజల్లు చందమామ
ఏల సలిలంబు పారు గాడ్పేల విసరు
ఏల నాహృదయంబు ప్రేమించు నిన్ను?"

ప్రేమగుట్టు తెలిసికొనుటకై జీవనపూరముల మునిగి లేచువారిలో బసవరాజు అప్పారావుగా రొకరు. ప్రేమలేక

ఈకవిజీవనమే లేదు ప్రేమయెఱుగనివాడు పాషాణహృదయుడు. ప్రేమ విఫలమయి ఎదమెత్తనగుటకై దుఃఖించుట మేలని ఈకవి యభిప్రాయము.

"ఎద మెత్తనగుటకై పొదగుందరా అంత
మదిగల యహమ్మంత వదలిపోవునురా"

"వల పెఱుంగక బ్రితికి
కులికి మురిసేకన్న
వలచి విఫల మ్మొంది
విలపింప మేలురా

చెలివలపులేని నీ
కలిమికాల్పనె వినుము
వలపుదీగెనె జీవఫలము
కాయునురా

ప్రేమకన్నను యెక్కు వే
ముందిరా యెల్ల
కావ్యపదవులకన్న
ప్రేమ యెక్కువరా

ప్రేమించు సుఖముకై
ప్రేమించు ముక్తికై
ప్రేమించు ప్రేమకై
యే మింక వలయురా?*

ఆచారశృంఖలములచే నిబద్ధమైన మనుష్యప్రకృతి ప్రేమపారిశుద్ధ్యమును గ్రహించలేదని, నిష్కళంకమై నియమబద్ధముగాని ప్రేమను దర్శించుటకై యీకవి ప్రకృతివంక తిరుగుచున్నాడు.

"ఈమావిపై నుండి
ఈవు కూకూయంచు
నామావిపై నుండి
ఆపెకూకూ యంచు
నేమిబాసల చేతురే
కోకిలా
యేమిబాసల చేతురే?

మనుజుల కగమ్యమై
మహిత శక్తిని గల్గి
పరమామృతము లొల్కు
ప్రణయవాక్కుల మీరు
బాసలాడుచునుంటిరే
కోకిలా
బాసలాడుచునుంటిరే?

పరులు విన్నను మీదు
పరువుపోవు నటంచు
పాడులోకము జూచి

భయమె లేకను వలపు
పలుకులాడగ జెల్లునే
కోకిలా
పలుకులాడగ జెల్లునే ?"

—'బసవరాజు'

హృదయవీణాతంత్రిల మీటించుచు భావకవి ప్రేమగానము చేయుచుండగ వియోగజనితమైన గళస్థగాద్గదికము ఆతని కడ్డువచ్చుచున్నది. నేటికవికి విప్రలంభగానము రుచించి నట్లు సంభోగలహరి రుచింపదు. దీనికిరెండుకారణము లూహ్యములు. సంభోగశృంగారమును వాఙ్మయములోనికి జొప్పింపబోయి ప్రబంధకవులు ఒకరినిమించి యొకరు కచకుచాదివర్ణనలచే నాంధ్రహృదయమునకు ఏవగల్గించిరి. అదిగాక కలయికయందు కరుణాశోకరసములకు తావులేదు. కరుణరసప్లావితముగాక హృదయరంజనము గానేరదు. గిరికమున్నగువార లెంత వలవల యేడ్చినను అది మనకు కృత్రిమమనిపించుచున్నది. ఆ కన్నీళ్ళతో మనకు సానుభూతి కల్గుటలేదు. ప్రేమ విఫలమొందినపుడు మనోరంగమందు రేకెత్తిననిరాశ, దుఃఖము, క్రోధము, అనుతాపము, ఉత్కంఠ మున్నగుకరుణాభావములు కవిహృదయము నెక్కువగా చలింపజేయుచున్నవి. కాంతావిరహాతురుడైన యక్షుడు గల్గుటచేతనే మేఘసందేశము అవతరించినది. అందుగలశృంగారరసము యక్షుడు వానికాంత యొక్క కరుణామయమగు విరహాకథనముచే శుద్ధమై

మనహృదయమును బందీగొనుచున్నది. కావ్యసిద్ధమైన రాధాకృష్ణుల విఫలమైన వలపే గీతగోవిందగానమునకు బీజమగుచున్నది. విప్రలంభమందు కన్నెవలపులు తపించి తపించి, "అతివిశుద్ధమును, అఘరహితమును" అగు నిర్మలప్రేమకు తావిచ్చుచున్నవి. ఈ రహస్యమును భావకవులు గుర్తించియే నిర్మలప్రేమారాధనకు గడంగిరి. ప్రేమయొక్క విఫలత్వమునే భావకవులు వర్ణించుటచే జీవితమందు నిరాశాభావమును ప్రేరేపించుచున్నారని కొందరు తలంచుచున్నారు. విచారదృష్టులతో ప్రపంచము నీక్షించుచున్నారని మరి కొందరు తలంచుచున్నారు.

"హృదయవనజాతసుమ
మృదుమనోహరదళము
లదయతను ద్రుంచినారే
పెంధూళి
జిదిమి వెదజల్లినారే!

హృదయ శోణితధార
నెదుగు జీవితవల్లి
మొదలంట దూల్చినారే
భయదాగ్ని
కీలలను వేల్చినారే"

—కృష్ణపక్షము

హృదయసుమమైన ప్రేమ కఠోరప్రపంచపాదఘట్టనచే నలిగిపోయెనని కవి వాపోవుచున్నాడు. విఫలమైన ప్రేమ నిరాశకును, ఎక్కువనిరాశ కర్కశత్వమునకు ప్రపంచపరాఙ్ముఖత్వమునకు చోటిచ్చి కవిహృదయము పగిలిపోయి దారుణము అరుంతుదమైన శోకకల్లోలము వెల్లివిరియుచున్న వేదులవారి "దీపావళి" యను ఖండకావ్యమును జదువుడు.

నిశీథిని

"జగతి యీనాటి యీమహోత్సవమునందు
మునిగి యానందమున బొంగిపోవుచుండ
ఇటు రగుల్కొల్పి రెవరు నీ హృదయమందు
నణచుకొనియున్న ఘోరదుఃఖాగ్ని నిపుడు?

నేను

కాటుకొన్న యమాసచీకటుల నడుమ
నే నొకండనె ఈశూన్యగృహమునందు
అదురువడిపోయి మరణవాద్యమ్ములట్లు
గుండియలుకొట్టుకొన నేడ్చుకొనుచునుంటి.

విస్మృతోదంతములు శూన్యవీథులందు
నావలెనె మౌనముగ వెళ్ళిపోవుచున్న
ఓనిశీథినీ! నీగభీరోదరమున
దొరకె నీదురదృష్టవంతునకు జోటు.

చిమ్మటు

బాణసంచుల పెళపెళార్భటులు విరిసి
దశదిశాంతరముల బ్రతిధ్వనుల నీన
పేదవడియున్న మానజీవితపుటాశ
లిపుడు మోగ్రించుకొనుచుంటి వేల నీవు!

నేను

నన్ను నిరసించువారియానందమందు
నాకు భాగమ్ము వల దొక్కనాటికైన
చీకటుల జీల్చికొని వచ్చు నీకరాళ
గానరవములనే నాసుఖమ్ము కలదు.

మొక్కనకొలంది కాలితో ద్రొక్కుచున్న
ఈకఠినలోక మెల్ల బహిష్కృతమ్ము
రండు, చిమ్మటలార! ఈరాత్రివేళ
నావలెనె పాడుకొనుమీరె నాకుసఖులు."

భావకవులలో కొందరిట్లు దురంతదుస్సహదుఃఖాగ్నిలో తప్తమగుహృదయమునుండి వెల్వడు గీతములచే సహృదయులకు వెరపు గల్పించుచుండ మరికొందరు కలికకోయిలలవలె కుహూరవములచే నలరించుచున్నారు.

"ఆనందమే లేదా
లోకమున
నానందమే లేదా!
ప్రకృతియందముల
పరికించుటలో

ఆనంద——

ఇంపగు నీసెల
యేటిగానమున ఆనంద—

అరుణములో సాం
ధ్యరాగంబుల ఆనంద—

పరిభాతవాయువ
బరవశ మొందగ ఆనంద—

చలువవెన్నెలల
సయ్యాటలలో ఆనంద—

ఆదర్శము లా
కాశమునంటగ ఆనంద—

భగవంతుని కడు
భక్తి పాడగ గన
నానాందమేలేదా
లోకమున
ఆనందమేలేదా"

"ఆనందమే లేదా"

—బసవరాజు అప్పారావుగారు.

మరియొకకవి భావిపురాతనాద్యతన జీవితనూతరిముల గరిథించి పామరునకుగూడ ఉన్నత వేదాంతము నందించి నేటి యం దనురక్తులను జేయుచున్నాడు.

"యెనకజల్మంలోన
యెవరమో నంటి
సిగ్గొచ్చి నవ్వింది
సిలక నా యెంకి—

ముందు మన కే జల్మ
ముందో లెయంటి
తెల్ల తెలబోయింది
పిల్ల నా యెంకి

ఎన్నాళ్ళు మనకోలె
ఈసుకము లంటి
కంటనీ రెట్టింది
జంట నా యెంకి"

—నండూరి సుబ్బారావుగారు.

సుఖస్వప్నరంజితమైన ఇహజీవన మెన్నిదినము లున్నను, అమాయకురాలైన యెంకికి తనివితీరదు. "యెనక జల్మం" ఇప్పటి చంద్రికామయమైన జీవితము గొనివచ్చినందులకు సంతోషపూర్వకమైన సిగ్గు, "ముందుజల్మంలో" యీ వెలు గుండునో లేదో యను వెఱపు, పామరులనేగాక పండితులను గూడ పరిష్కృతమునం దనురక్తులను జేయుచున్నది.

కవికర్మ శిరీషకుసుమమువలె లలితమైనది. విమర్శకుడు తుమ్మెదవలె రసాస్వాదనదీక్షతో కావ్యము నుపగమింప

వలెను. నర్మసంరంభముతో కావ్యసుమమును తాకవలెను. మహాకవి కాళిదాసు పార్వతిని గురించి వచించినట్లు

"పదం సహేత భ్రమరస్య పేలవం
శిరీషపుష్పం న పునః పతత్రిణః"

శిరీషపుష్పముపై తుమ్మెదవలె వ్రాలవలెను గాని ఘోరగృధ్రమువలె పడినచో కావ్యసుమము నలిగిపోవును. భావకవిత్వము సున్నితమైన మనస్సుతో సహృదయు డానందింపదగిన దేకాని కఠోరలాక్షణికమానదండముతో గొలిచి కొలవడినదని చెప్పువారి కిదియే భవభూతిసమాధానము:

"యేనామ కేచిదిహ నః ప్రథయంత్యవజ్ఞామ్
జానంతి తే కిమపి తాన్ప్రతి నైష యత్నః
ఉత్పత్స్యతే మమ తు కోపి సమానధర్మా
కాలో హ్యయం నిరవధి ర్విపులా చ పృథ్వీ."



[హైదరాబాదు నగరమున శ్రీకృష్ణదేవరాయాంధ్రభాషానిలయమున ఉపన్యసింపబడినది.]

# కవితాంజలి - జడకుచ్చులు



సమకాలీనులైన కవుల గ్రంథవిమర్శనమునందు కొన్ని యెడల సున్నితమైన చిక్కులు అద్భుతవులుచుండును. ఆయా కవుల వ్యక్తిత్వముతో మనకుగల దైనందినసంబంధములు, సానుభూతి, ఏవగింపు మున్నగునవి వారికవిత్వవిమర్శనము నందు కేవల రసానుభూతికన్న ముందు పరుగెత్తి విమర్శకుని దృష్టిని చిత్రవర్ణరంజితముచేయును. ఈ యసమదృష్టితో జూచినకనులకు కవివ్రాసిన ప్రతియక్షరమునందును నవనవోన్మేషకల్పనాప్రతిభ స్ఫురించుటగాని లేక యర్థశూన్యమును, భావరహితమునైన వ్యర్థప్రలాపము గన్పించుటగాని జరుగును. ఒక్కొక కవికుమారుని తీరుతియ్యములు మనలను ముగ్ధులను జేసి యాతని నిర్మాణములయందున్న దానికన్న ఎక్కువ మహత్త్వమును దోపించును. మేఘాలోకమున విస్తృతబర్హమైన వనమయూరినాట్యాడంబరముచే ముగ్ధమైనట్లు, ఆటవికకన్య నిబిడరసాలముయొక్క కన్నెచిగుళ్ళచాటున యడగి మడగి యానందసాంద్రమై లోకము తన్నుజూడకుండ పాడుకొను కలికికోయిలను వెదకిచూచుటకై నిలువదు. ప్రత్యక్షవ్యక్తిత్వమునందంత సమ్మోహన మున్నది. నులితీవలు ముందు నడువ తీగభారము వెనువెంటనడచినట్లు కృతులవెంట కవియొక్క ప్రత్యక్షవ్యక్తి అంటియుండుటచే సమకాలికుల కావ్యవిమర్శనమునందు ఒడిదుడుకులు మెండు. పరోక్షవ్యక్తులైన

పూర్వకవుల విషయములోనే భిన్నభిన్నాభిమానములు గన్పట్టుచుండ మన కనులముందర లోపాలోపములతో నడయాడుచు, మానవ సామాన్యముకన్న నుజ్వలకల్పనాశక్తిలో తప్ప ఇతరములం దభిన్నులయిన భావకవులయెడ నిష్పాక్షిక విమర్శనము వెల్వడు సమయ మింకనురాలేదనితోచును. ఐనను ఆధునికకవిత్వముయొక్క విలువ నిర్ణయించుట ఆనంతరికుల కెట్లు విడువవలెనో అట్లే భావకవిత్వవిమర్శనమునందలి సత్యాసత్యములు గుర్తించుటగూడ వారి పనియే.

ఆంధ్రసారస్వతమునందు విమర్శనాపద్ధతి నూతనమని చెప్పవచ్చును. వాఙ్మయము చాలకాలమువరకు తీరికగల ఏకొలదిమంది విద్వాంసులను రాజన్యులను మాత్రమే

'తెల్లనురపొన్నపూల సంకెళ్లతోడ'

బంధమేసెను. కృతులయందలి సంవృతశృంగారము వారికి వివృతమే యగుటచే విమర్శించి చూపవలసిన యావశ్యకత లేకుండెను. సారస్వత మను పువుదోటలోనికి చొరుట కల్పసంఖ్యాకులకు మాత్రమే హక్కుగలదని మనవా రనాదిగ నమ్ముచున్నారు. ఇతరులను వారందు కాలిడనీయరు.

'తోవలన్నియు గలియు పాక్కోరణమున
గలద యపరంజిరెక్కలతలుపుజంట
మూసియున్నారు ప్రాజాపప్రపూర్ణమతులు'
— తెనుగుతోట.

రసాస్వాదనశక్తి పూర్వపుణ్యఫలమని మన సిద్ధాంతము.

'పుణ్యావంతః ప్రమిణ్వంతి
యోగినో రససంతతిమ్'

సిద్ధాంతమే కాదు. అది యనుభవముమీద నిర్మింపబడిన సూక్తియే.

'సుకవిభోజ్యమ్ములౌ లిచటివస్తువులు వీని
నలిపివేయకు డటునిటు కలచివైచి'

అని పింగళి లక్ష్మీకాంత కవి హెచ్చరించును. కాని ఆంగ్లేయులు వారి రాజ్యాంగమునందువలెనే వాఙ్మయమునందును అల్పసంఖ్యాకులు మాత్రమే జుట్టుకొనుట కిచ్చగింపరు. వారు ప్రజాస్వామ్యవాదులైరి. మహాకవులు 'గగనపథవిహారవిహంగమపతులు.' కవిహృదయము నడిసముద్రమువలె గభీరమైనది. దాని యడుగంటమునిగి ముత్యపుచిప్పలేరి తెచ్చికొనుట ప్రాక్తనజన్మవిద్యచేగాని యలవడదు.'

'నిత్యవర్చస్వినీ! లేఖినీ! త్వదీయ
చిరరహస్యసంకల్పమ్ము లెరుగలేను.

చెమటలోడుచు బొగ్గుగనులలో దేశద్రోహుల పాపసమాధులలో కష్టించు కార్మికులకును, పొండ్లుగలతోలుసంచీల పూతిగంధమును గాని యన్యసౌరభము నాఘ్రాణింప జాలని యజమానసంఘమునకును సారస్వతమధువు నందిచ్చుటకై సులభమైన విమర్శనాపద్ధతి ఆంగ్లేయులలో వెలువడు టావశ్యకమాయెను. ఆధునికయుగమునందు యంత్రములు మానవుని కీలుబొమ్మవలెచేసి దురంతదుస్సహవేగముతో త్రిప్పివేయుచున్నవి. అంబరచుంబియైన యగ్రములతో ఈ విశాల

పృథ్వికి మానదండముగ నిల్చిన నగాధిరాజుయొక్క విశాల సానువులు మానవునకు క్రీడారంగములు నేడు. శాంతమహా సముద్రముయొక్క లోతు తెలియని యభ్యర్ణ మందిరముల సముజ్జ్వలమణిమయకిరీటధారిణులైన వరుణకన్యలతో నాతడింతలో గుసగుసలాడి మరలివచ్చును. 'వేగము, వేగము' అని కరాళవక్త్రమును దెరచికొని కాలరాక్షసుడు గాండ్రించుచున్నాడు. మానవునకు విరామము తీరికయు కలలోని వార్తలు. వాఙ్మయవిహారములు తీరికగలవారికేగాని నిరంతర పరిభ్రమణశీలురకలవడవు. యంత్రగతుడైన మానవునకు కవులకావ్యములను జదివి, యన్వయించి, వాచ్యార్థకవాటమును దెరచి సంవృతశృంగారమూర్తిని దర్శించి రసబ్రహ్మము నుపాసించునంత తీరికలేదు. ఆతనికి సూక్ష్మమార్గములు, దగ్గర త్రోవలు, అడ్డగట్లు మిక్కిలిప్రీతి. అవియే యాతనికి శరణ్యములు. ఆధునికవిమర్శనము లీ దుర్బలావకాశమును తీర్చుటకేర్పడినవి.

పూర్వవ్యాఖ్యానములు పాండిత్యలోపమును పూరించుటకు దోడ్పడుచుండెను. కవియొక్క అర్థమును విస్పష్టము చేయుట వ్యాఖ్యాతపని. కవిత్వమందలి నెత్తావిని పసిబట్టి పాఠకున కందించుట యాతనిపనిగాదు వ్యాకరణవిశేషములనెందుగను, వ్యంగ్యార్థముల సకృత్తుగను వ్యాఖ్యాత విమర్శించును. విమర్శకుడు సహృదయుడు. వ్యాకరణ సూక్ష్మములతో పెనగులాడుట యాతని పనిగాదు. అభిధార్థముకన్న శబ్దముయొక్క వ్యంగ్యార్థము ఆతని కుపాస్యము. రసజీవితమైన సారస్వత

ప్రక్రియచే యాతని విమర్శనావిషయములు. కావ్యసౌందర్యముల వివరించుటకు మాత్రమే మొట్టమొదట ఏర్పడినవైనను లాక్షణిక గ్రంథములు సంఖ్యాబాహుళ్యముచే గాబోలు శక్తివంతములై కవితావిహంగమును పంజరబద్ధముచేసివైచి తాము నిర్ణయించిన స్వర్ణశృంఖలము లనుమతించినవరకే ఎగురనిచ్చును. కవితావాహిని నిందు టేళ్ళలో పార్సి పారసీక సాంగ్సైనరంగు రంగుల రాళ్ళతో నిర్మింపబడిన పిల్లకాల్వలగుండ బలవంతముగ ప్రవహింపజేయబడెను. విమర్శకుడు కవిచరణంబుల శృంఖలములు దగిలించి యాతని స్వేచ్ఛాగానవిహారిని అడ్డగించుచు స్వయముగ నాతనియందు రసస్పందమైనగాని కవి హృదయమధువును అమ్మకమునకై కొనిరాడు. కవిసుమము [illegible] యంటియుండును. దక్షిణానిలమై కావ్యసుమమును

"మందంమందం నుదతి......అనుకూలః"

విమర్శకుడుకూడ కవివలె సౌందర్యోపాసనాపరుడే. కావ్యామృతసరస్సునందలి పద్మముల నేరి శ్రద్ధాళువులైన పాఠకులముందరనిడి ఆఘ్రాణింపుడని వినయముతో నిలువవలెను. కాంతాసమ్మితములైన ప్రబంధరీతులకు కఠోరమైన లాక్షణికావగుంఠన మేలని త్రోసివేయును. కుసుమసుకుమార దేహ! అయ్యో! వాటములమధ్య బంధించుటేమి! వాఙ్మయ [illegible] బడి యతివిశాలమైన సికతాతలంబున [illegible] కవియొక్క యడుగుజాడల నరయుచు బోవును [illegible]. గుణకథనమే విమర్శకుని మహదాశయము. దోషా

ల్లేఖనము చేయనంతమాత్రమున నాత డొంటికంటినిమాత్రమే తెరచినాడని నిందించుట తగదు. కుకవినింద సాంప్రదాయిక మైన యాచారమైనను అది ఒకప్రక్క వారికైనను గౌరవ మాపాదింపదు.

"జడకుచ్చులు - కవితాంజలి:" ఇవి సారస్వతక్షేత్రము నందు పాదుకొనిపోదగినవా లేక విమర్శవాతాహతిచే కొట్టు కొనిపోవునవా అని విచారించెదను. కావ్యములకు జీవగఱ్ఱ యైనది నవనవోన్మేషకల్పనాసామర్థ్యము. అణువు మొదలు అజాండమువరకు గల సృష్టిగతపదార్థము లన్నియు కవికి కవితావిషయములే. మధుమాలి యవ్యక్తఝుంకారమునందు కూడ నొక గంభీరసృష్టిరహస్య మాతని చెవులలో గింగురు మనును. ఆభావమును కవి తన హృదయ వీణాతంత్రులమీద మోగించి సరిచూచుకొని గీతాకలశములందు పోసి మన కం దిచ్చును. రావియాకువలె సదా చలించు హృదయము గల కవిత్వమే కాలగర్భమందు పడి నశించక కొలనుమీది తామరాకువలె తేలి యాడును. సృష్టి పరిశీలనముచే రసస్పందమైన హృదయముతో కవి జీవిత సూత్రము నన్వయించి భౌతికప్రకృతికిని మానవతత్వమునకును గల సామరస్యమును విశదీకరించి తల్లియుత్సంగముపై కుమారు నిడి ఆనందముచే చప్పట్లు చరచును. ఇన్నిటియందును కవి సౌందర్య మను కుంచెతో పనిచేయును. ప్రకృతి పరిశీలనము కవికిని శాస్త్రాభ్యాసకునకును సమానమైనను శాస్త్రము ప్రభు సమ్మిత మగుటచే నందు హృదయకంపనముగాని సౌందర్య

రాగముగాని వెదుకబోము. సౌందర్య మను విచిత్రరాగము కవిత్వమునకే చెల్లును. ఈసౌందర్యనియమములను పాటించని కవిత్వము కేవలశాస్త్రచర్చలోనికిదిగిపోయి పంకమగ్నమగును. సౌందర్యముప్రదర్శింపదగినవిషయమును విషయబాహుళ్యము నుండి ఏరుకొనుటయందు చూడగలము. ప్రదర్శనీయవస్తువును కావ్యసూత్రముల కంగీకారమగునట్లు చెక్కి తరిమునబట్టి సహృదయులమెప్పులనుంచుట మహాకవికే తగును. ఇది కవితా శిల్పము. కావ్యశిల్పమునకు భాష 'కమనీయ తనుకాంతి కనకపరిచయము'. ఈ తనుకాంతి ఎంతఆడంబరముగను, భావ మునకు దూరముగ నుండునో అంత అనాగరికముగను, లంబా డీలు మున్నగువారి దేహాలంకారములవలె పరిహాసనీయమైన భారముగను తోచును. కేవల శబ్దచిత్రములు కూయలేని రంగు రంగుల పిట్టలవంటివి. మొదటితరగతి కవులలో శబ్దజాలముతో నాటకీలుచేయు చాపల్యమును గాంచము.

ఆధునికదృష్టిలో సౌందర్యనియమబద్ధమైన ఉత్కృష్ట వస్తువే కావ్యాత్మయు, కావ్యజీవనహేతువు నని నాయభిప్రాయము. మహాపురుషగుణవర్ణనమే కావ్యప్రతిష్ఠా మూలక మని పూర్వలాక్షణికుల మతము.

'ఉపశ్లోక్యస్య మాహాత్మ్యా
దుజ్జ్వలాః కావ్యసంపదః'

ఇది మనఃప్రధానమైనయుగము. అప్రత్యక్ష విషయములను జిజ్ఞాసపైగాని నమ్మరు. కావున మహాపురుషులకన్న మహావస్తువులే నేడు కావ్యసంపత్కారములు. ఈ యుగమున

జీవితసమస్యలు మెండు. జీవనపూరంబుల నార్ద్రమనోవృత్తు లతో నీక్షించుచు ఆయా క్లిష్టసమస్యల కు త్తరపూర్వకమైన 'ఆత్మసందేశమును' లోకమునకు గొనిపోవుచున్నది. కనుకనె 'జడకుచ్చులు-కవితాంజలి'యందలికవిత్వము భావియందు న్నత స్థాన మలంకరించుట కర్హమగుచున్నది. ఆంగ్లేయులలో విమర్శకాగ్రేసరులయొక్క భావముగూడ నిదియే. వాఙ్మయము జీవితవిమర్శన మవధిగాగల్గినదని వారు తలంచుచున్నారు.

'Literature is the criticism of Life'

ఈ బాధ్యత వాఙ్మయవృక్షమునకు మారినువంటిదైన కవిత్వముపై నెక్కుడు మొగ్గుచున్నది. విశ్వవ్యాప్తమైన ప్రకృతిరంగము, గభీరమైన జీవితసమస్యలు అనుకొండరాళ్ళపై నిర్మించుకున్నాడు కవి తన కవితాప్రాసాదమును. ఈ కావ్యములు వస్తుప్రాధాన్యములుగాని రీతిప్రాధాన్యములుకావు. కవి రీతియందునిష్ఠుడైన కన్న కవిత్వవిషయమునందు బద్ధలక్ష్యుడు. రీతిప్రాధాన్యములైన కావ్యములకు శాశ్వతసారస్వతమునందు తావులేదు. కవి సమకాలికులకు నొకసందేశము నందించుటకే పాడుకొనుచున్నాడు. లేనినా డీకావ్యములు వెలువడియుండవు. కవి మతకర్తవలె యుపన్యాసరంగమునెక్కియేల ఉద్ఘోషింపడు? కావ్యవేదికనే యాతడాకాంక్షించును. రాయప్రోలుకవి అతివాదియుకాడు. వితండవాదియుకాడు. ఆతడు సిద్ధాంతములను స్థాపింపబూనలేదు. ప్రతిభాతప్తమై, బృంహితమైన మనోంబరమున జ్వలితాగ్నిలోనిబంగారురేణు

వృలవలె వెలుగు జీవితసమస్యల తెరవు లిట్టివని మధురమధురముగ గానముచేయును. స్వాతివాన జల్లులాడుచుండ సహృదయులను ముత్యపుచిప్పలు నోళ్ళు తెరచుకొని రసమును గర్భికరించుకొనుచున్నవి. ఆ యమూల్యములైన వర్ష బిందువులే వృక్షాగ్రములమీదను పర్వతములమీదను బడుచున్నవి స్వధర్మనిర్వాహణబుద్ధితో మాత్రము. రసమును చిలుకుటయే కవిఉద్దేశము గాని సాంఘికప్రవాహమున కానకట్టుకట్టి తనసిద్ధాంతపు కాలువలలోనికి జొప్పించుటకాదు. కావ్యపద్ధతియే రాయప్రోలు కవికి సందేశపథము.

'కాంతరూపమె రసవదాకర్షణంబు'

కాంతాసమ్మితమైన కావ్యమే ఉపదేశమున కర్హమైనది. అందును కవికి ధ్వనిరూపమైనగానము మరియు ప్రియము;

'అందు సంవృతశృంగారముం దొలంకు
ముద్దువేస మత్యంతసమ్మోహనంబు.'

అస్తినాస్తివిచికిత్సాహేతువు కాని వస్తుసమృద్ధియు మధురమధురఫణితులును ఈ సంపుటద్వయములో ముఖ్యముగ గణింపదగిన విషయములు.

కవి జీవించినవాతావరణ మెట్టిది? తద్వారా ఆతని కావ్యములు పోషించుటయందు పరిస్థితు లెట్లు తోడ్పడెను? లేక కవి తాను విహరించిన సంఘారామములో నెట్టి పాదపవిత్ర చిహ్నముల విడచెను? అను విచారణము ఆధునిక విమర్శనా పద్ధతి. రాయప్రోలు కవితాసాంప్రదాయమునందు ధన్యుడు.

విశ్వస్తుత్యుడైన మహర్షి రవీంద్రనాథ ఠాకూరుగారి గురుత్వమున మెదుపబడినాడు కవి.

'గాఢనిద్రోపవాసశుష్కమ్ములయిన
కాళరాత్రుల దుఃఖసాగరము దాట
జుక్కలైనను నాతోడ జూపనపుడు
దాన మెవడిచ్చె చుక్కానిలేని నావ.'

అనంతమైన తనకవితాతీరమునందు పడియున్న ఒక చుక్కానిలేని నావలో కవిని పడవైచి భావసముద్రములోనికి తోసినాడు రవీంద్రుడు. రాయప్రోలుకవి వాఙ్మయమహోదధిలోబడి మెల్లమెల్లగ కొట్టుకొనుచు స్వతంత్రపద్ధతినే పోయినాడుకాని గురుపూదినశంఖమునే తిరిగి యూది చౌర్యమునకును స్వతంత్రప్రతిభాశూన్యుడు అను విమర్శకును పాలుగాలేదు. రవీంద్రుని గ్రంథముల తెనుగులోని కనువదించి కేవలము అనువాదకుడు గాలేదు. జడకుచ్చులం దిట్టి అనువాదక ఖండకావ్యములు వసంతము, సఖిసంవరణము నను రెండుమాత్రమే కలవు. కవితాంజలియం దనువాదకభాగములు లేనే లేవు. ఐనను విశ్వైకగాయకుడైన రవీంద్రుని తత్వము రాయప్రోలు వారియందు పూర్తిగ ప్రతిబింబించిన దనుటలో సందేహము లేదు. రవీంద్రుని విశిష్ట సందేశమును ఆంధ్రుల కందించి భారతీయ కవితావాహినియం దవిచ్ఛిన్న సంబంధమును నెలకొల్పినా డీకవి. రవీంద్రుడు విశ్వజనీనుడయ్యు సస్యశ్యామలమైన వంగదేశక్షేత్రములందు సస్మితమైన మాతృవదన కమలము నుపలక్షించుచున్నాడు. ప్రపంచ విజ్ఞానమునకు

మాతృకమైన సనాతనార్య విజ్ఞాన దుగ్ధమును కడుపార త్రావి విశ్వవిశాలమైన పచ్చికబయళ్లలో ఆడుకొనును రవీంద్రవత్సము. ఠాకూరుగారితండ్రి మహర్షి దేవేంద్రనాథఠాకూరు బ్రాహ్మ సామాజికులలో కెల్ల సనాతనాభిమానపూరితుడు.

'అసతో మా సద్గమయ
తమసో మా జ్యోతిర్గమయ
మృత్యోర్మా అమృతం గమయ'

అను నుపనిషత్సూక్తము మహర్షికి కరువునపోసిన విజ్ఞానము. ఆర్యఋషుల సాంప్రదాయము లీతని కవశ్యానుష్ఠేయములు. క్రైస్తవప్రాయులుగ నడుచుకొను బ్రాహ్మసామాజికులలో కవిసార్వభౌమునికి ప్రథమవయస్సునందే యుపనయనముచేసి వైదికకర్మానుష్ఠానమున కర్హతగల్గించెను. పాశ్చాత్య నాగరకతతో గల్గిన ప్రథమసంపర్కమను దుమారమునందు అంధీభూతమైన భారతీయదృష్టి క్రమముగ తొంటినైర్మల్యమునుబొంది 'గంగాయమునయోర్మధ్యే' వాసులైన వైదిక ఋషి చరణముల కంజలి నిడు జాతీయ పునర్నిర్మాణమున రవీంద్రుడు జనియించెను. లోకసమ్మోహనమైన తనమురళిపై విస్మృతభారతీయౌన్నత్యగీతములను రవీంద్రు డొకవంక వాయింపుచుండ, గిరిగహ్వరోత్థితసింహకిశోరము భంగి వివేకానందుడు ఆర్షవిజ్ఞానప్రాశస్త్యమును చికాగోవేదిక నుండి నెరగందిన ప్రపంచ మత ప్రతినిధులకు గర్జించుచుండెను. దీనినే అరవిందయోగి భారతీయనవ్యవిజ్ఞానోదయసమయమని వాకుచ్చును. లోకమాన్యుడుకూడ ఈ భవ్యకాల

మందే కర్మయోగవాజిని జాతీయతాస్యందనమునకు బూన్చు డని శ్రీకృష్ణునివలె ఆచరణమూలకమైన యుపదేశమునకు బూనుకొనెను. అస్తమితభారతభానుడు పొడుపుమలపై దోచెను. మనకపి ఈ సాంప్రదాయములలో మెలగి ఆంధ్ర వళి కీపునరుజ్జీవనసందేశమును కవితాకన్యకతో సారెవెట్టెను. ఋషిసాంప్రదాయము లీ కవికి మిక్కిలి రుచించును. నూతన జాతీయ పథమున తప్పటడుగులతో నడువనేర్చిన తెనుగు కన్యకకు వైదికాశీర్వాదములే జృంభకాస్త్రముల వలె సంర క్షకములని చాటుచున్నాడు.

'కానరాని మహర్షిలోకమ్మెల్ల
వైదికమహదాశీర్వాద ఫణితి వినుచు
చాటలాడిన పడుచుల నాదరించి
దర్శనం బీయగలరు వాత్సల్యరక్తి.'

ఋషియుగమునాటి సుప్రశాంతమును పవిత్రమును అకృత్రిమమును ధన్యమునైన సరస జీవిత ప్రవాహమును లలిత మనోజ్ఞమైనపదావళియందు చిత్రించినాడుకవి స్నేహలతా దేవియందు. గాంగతీరమును జేరినతోడనే యా పవిత్రతటినీ శీకరములచే నార్ద్రమైన యామెరసవత్తర కల్పనాశక్తిలో వాల్మీకి స్నానఘట్టము పునర్ద్యోతక మయ్యెగాబోలు;

'వైదికయుగంబునాటి దివ్యర్షులెల్ల
పవనచాలనమున నలల్ గవిసి కవిసి
తుంపురులగుంపు లెత్తి తొ్రిదోప్పులాడు
చిందు నవగాహనము లాడి యుందు రపుడు.

సుప్రశాంతములగు నుషస్సులను లేచి
చలి నెఱుగక మాఘస్నానములను సలిపి
తపసికన్నెలు వల్కలధారణమున
పసుపుముగ్గులు తీర్చి రీ భవ్యతటిని.'

పాశ్చాత్య వ్యామోహదూషితులై దురాచారము లకును అత్యాచారములకును బాల్పడి దుఃఖితులైన నేటియువతీ యువకులకు ఆదర్శపూర్వకమైన యుపదేశము ననురాగపురస్సరముగ కవి యొసంగుచున్నాడు. నిరంతర పరిభ్రమణ వేగముచే తలదిమ్మెక్కి నిషిద్ధవ్యాపారలోలురును నిషిద్ధాహారులు నయి ఆయురారోగ్యముల వమ్ముచేసికొను యువజనాళి నియమబద్ధమై అకలుషమైన ఋషిమార్గమున నడచిన దేశసౌభాగ్యము వేరొండులేదని కవి చెప్పక చెప్పుచున్నాడు. ఈదృక్పథమునందు రాయప్రోలుకవి గురజాడవారికి కేవలప్రతిస్పర్ధి. అప్పారావుగారు ఆంధ్రలోకమునందున్న కుసుమాలమును ప్రక్షాళితముచేయ బద్ధకంకణులు. రాయప్రోలువారు నట్లే. కాని గురజాడ నీలితెరచాటున పవిత్రోజ్జ్వలబింబ మున్నదని గుర్తించలేదు. సమకాలికదురాచారమూఘాచార భూయిష్ఠమైన సంఘజీవితము సనాతనమని తలచియుండనోపును. సత్యాన్వేషణము శుద్ధశాస్త్రపరిశీలనము పాశ్చాత్యులలోనే వెలసెననియు మనము వారినుండి నేర్చుకొనవలెననియు అభిప్రాయపడెను.

'కన్నుగానని వస్తుతత్త్వము
గాంచనేర్చరు లింగిరీజులు

కల్లనొల్లరు వారివిద్యల
కరచి సత్యము నరసితిన్.'

తోకచుక్కను చూచి వెఱపొందెడు చిన్నబుద్ధులని పూర్వుల విమర్శించుటచే గురజాడవారు మనవారిపూర్వప్రతిభను గుర్తించలేదని చెప్పవలసివచ్చుచున్నది. రాయప్రోలు కవికి భారత దేశమువంటి పుణ్యక్షేత్రము లేదు.

'ఏ దేశమేగినా ఎందుగాలిడిన
ఏపీఠమెక్కినా ఎవ రెదురయిన
పొగడరా నీతల్లి భూమిభారతిని.'

కర్మజ్ఞాన భక్తియోగములకు నిలయమయి 'ఉపనిషన్మధు వొలికిన విపినబంధురవృక్షవాటిక' జనించినందుకై కవి నిండు గర్వము నందును. మానవజాతి పొత్తిళ్ళలో నున్నప్పుడే ప్రకృతినేపథ్యము చాటునున్న పురుషునిగూర్చి చేసిన జిజ్ఞాసాఫలితములై నేటికిని ఉత్కృష్ట జ్ఞానభాండారములైన వేదశాఖలు వెలసిన యుదారఖండమగుటచే భరతపుత్రులమైనందు కవమానపడవలసిన యవసరములేదని కవి ఘోషించుచున్నాడు. ఉజ్వలకల్పనాసీమలో జ్వాలాశిఖలతో ప్రత్యక్షీకృతమైన యీ పవిత్రబింబము విశ్వమాతృ స్వరూపమును వహించి కవికి ఉపాసనావిషయ మగుచున్నది. దేశభక్తి ఉపన్యాసవేదికపై పుట్టి చచ్చునది గాక కవులయొక్క ఆధ్యాత్మతత్వముతో నైక్యమొందుచున్నది. ధర్మక్షేత్రమైన కురుక్షేత్రమందు పార్థుడు చూచిన విశ్వరూపమే,

ఒకవంక

'దివ్య మాల్యాంబరధరం
దివ్య గంధానులేపనం'

ఔను, మరియొకవంక

'దంష్ట్రాకరాళాని చ తే ముఖాని
దృష్ట్వైవ కాలానలసన్నిభాని'

కవి భరతమాతముఖంబున గాంచి పరవశుడై

'అదృష్టపూర్వం హృషితోస్మి దృష్ట్వా
భయేన చ ప్రవ్యథితం మనో మే'

అని పాడుచు భయాశ్చర్యములకు లోనగుచున్నాడు. ఒక్కొక్కప్పుడు మాతృస్వరూపము

'సుజలాం సుఫలాం మలయజశీతలాం
సస్యశ్యామలాం......''

అని యూహించును. మరొకప్పుడు

'త్రింశత్కోటికంఠకలకలనినాదకరాళే
ద్వాత్రింశత్కోటి భుజై ర్ధృత ఖరకరవాలే'

అని వెఱుగుపడి జోహా రొనర్చును. రాయప్రోలుకవికి గూడ

'శ్రీలుపొంగిన జీవగడ్డయి
పాలుబారిన భాగ్యసీమయి'

పరగిన యీభరతవర్షమే విశ్వమాతృస్థానము వహించును. పూర్వపుణ్యవశముననో యోగబలముననో ఈ స్వర్గలోకమున జనించితినని కవి తలంచును. రవీంద్రునివలె మన కవియు విశ్వామోదము వాసింపదలచినవాడయ్యు, విశ్వశ్రేయమే ఆదర్శముగా గలవాడయ్యు కవితాసహాయమున

'క్షాళితవిశాలవిశ్వరంగంబునందు
నిండు వెన్నెల తెలిచాందినీలు గట్టి'

విశ్వశాంతిని నెలకొల్పదలచినవా డయ్యు స్వమనోకల్పిత జ్యోతిర్మయ రంగంబుల

'ఒక క్రొత్త బరువుతో
ఒక క్రొత్త యాసతో
కనరాని వెలుగుకొఱకై'

యన్వేషించు ఊహాజీవి కాడు. ఇంటగెల్చి రచ్చగెలువ తగునను తెనుగుసామెతయొక్క లోతు గుర్తించినవా డగుటచే ప్రపంచసమస్యలనుంచి తెనుగుతోటలో నూతనజీవ ప్రవాహమేత మెత్తుటయే ప్రథమకర్తవ్యముగా స్వీకరించెను. ఆంధ్రప్రబోధమునందు ప్రాచీనాంధ్ర ప్రశస్తిని గానముచేయుట మొదటిమెట్టని గ్రహించుటలో మనకవి ప్రప్రథముడు. ఈయసజ్జితతంతువును వీణకు తగిలించి ఉద్రేకపూరితముగ గానము సేసి సోదరకవులకు మార్గదర్శి యగుటచే రాయప్రోలు ఆధునికకవితకు

"మధుర మధుర ఫణితీనాం మార్గదర్శీ"

అనుగౌరవమునకు పాత్రు డని పలువు రంగీకరించినారు. తమజాతియొక్క పూర్వప్రతిభ కై గర్వింపనిప్రజలు లేరు. నిద్రించి పసచెడినప్రజాళిని మేల్కొలుపుటలో ఆజాతి తొల్లింటి వైభవము నుద్ఘోషించి కార్యదీక్షను శౌర్యమును పురిగొల్పుట సఫలమైన త్రోవ. ఆంధ్రచరిత్రకారులలో విజ్ఞాని కొమర్రాజు లక్ష్మణరావు గారి గంభీరరహస్యమును మొదట పసిబట్టి కట్టుకథలను పోనాడి సత్యమై జీవాగ్నియైన భారతచరిత్రను సంపాదించిరి. జాతీయోద్బోధమునందు విమర్శామార్గ మవ లంబించిరి వీరేశలింగము అప్పారావుగారలు. నిమ్మకు నీరువోసి నట్లు జాతియొక్క సత్యయశోగానముతో పునర్నిర్మాణ పథ మున నడచిరి లక్ష్మణరావు సుబ్బారావుగారలు. ఈమార్గ మిప్పుడు సర్వజనామోదము నంది ఏకమార్గముగా స్వీకరింప బడినప్పటికి ఈబంగారుగనిలోనికి

"............చావలేదు.
చావలేదు ఆంధ్రులమహోజ్జ్వలచరిత్ర
హృదయములు చీల్చి చదువు డో సదయులార!"

అని ఆంధ్రహృదయములు పొంగిపొరలునట్లు పాడు కొనుచు మొదట నడుగుపెట్టినవాడు మనకవి. భారతదేశము యొక్క క్షాత్రయుగముల చండశౌర్యము నెంచి కల్పనా ఫాలము తెరచిచూచినకవికి,

"రణరక్తబంధురారుణమైన ఖడ్గతి
క్కున కత్తికడిగిన కదనభూమి"

'జ్వాలామాలికానిక్షిప్త వహ్నిప్రాకారమై' ఆభాస మయ్యెను. నెల్లూరునందు సమావేశమైన తుములాంధ్రసమ్మేళనమునం దీనూతనభారమును కవి దింపుకొనెను. శ్రీరాముని యశ్వమేధమందు లవకుశులవలె ఆంధ్రరత్నము రాయప్రోలు వీణ మీటించి ఆంధ్రులభావతీవ్రతను మేఘములలోనికి గొనిపోయెను. నే డట్టిగాయకుడు లేకపోవుటచే భావవాహిని నిస్తరంగమై వినువారు పాడువారు లేక అనాదృతమైనదని కవి చింతామందితు డగుచున్నాడు.

"రాగశుకము పీడాపంజరమున బడియె
భావగీతము నిక రచింపంగనేమొ
చెప్పసకియయు పాడెడుచిలుక లేక"

ఒకనాడు కాకతీయులకదనపాండితిచే లోకమంతకు కాకవెట్టిన యీ పోటునేలయందు కాలవశమున జీవశక్తులు నివురుగప్పినవి. మహితకాసారశుచి కసుమాల మయ్యెను. జాతియొక్క ఈ దుష్పరిణామము ఆంధ్రులలో శౌర్యము కరవగుటచే కాదు. విజ్ఞానపథము ఇరుకయి దారి చూపవలసినవారు ప్రాలుమాలిరి. ఏతములు ద్రొక్క దొరువునీ రెత్తు తోటమాలులు తమ స్వధర్మములు నిర్వహింపక పోవుటచే తెలుగుతోటలు బీటలువారెను. విజ్ఞానకుల్యలు తరుమూలము లన్నిటికి బోనీక నిమ్నజాతుల వెలిజేయుటచే జాతియొక్క నిండుజీవనము విజృంభించుట కవకాశములేక ఏకపార్శ్వాభివృద్ధియు, క్రమముగ నిలువనీటిదనమును జాతిలక్షణము లయ్యెను. ఏతన్మూలమున జ్ఞానచంద్రికలు బ్రాహ్మణాగ్ర

హారమునందును చండాలవాటికయందును ఏకసరణిని ప్రసరించుట కవియాదర్శమని మన మూహింపదగును. పంకమగ్నమైన జాత్యుద్ధరణము చదివిన పురాణపంక్తులె చదివికొను వేదాభ్యాసజడునిచే కాజాలదని కవి తలంచును. సనాతను లనబడువారు నిర్జీవమైన శవసూత్రములలో సూక్ష్మములను వెదకుటలో నేర్పరులే గాని,

"చంపకము లెత్తికొనిపోవు చతురమతుల
కంచెతీసి త్రోవలుసేయువంచకులను"

తెలిసికొనలేరు. ఇక జాతిసంరక్షణము వా రెట్లు చేయగలరు ? ప్రకృతిసిద్ధమైన జీవసూత్రములను గ్రుడ్డివారువలె నతిక్రమించుటచేతనే సంఘమందు ఆయురారోగ్యభాగ్యములు పాత్రమాటలై పోయెను. పూర్ణరసవతులు కానిలేమొగ్గకన్నెలనుబాధించు నేటిమిళిందబాలకులు ఉభయులను బురదలోని కీడ్చుకొనిపోవుచున్నారు. స్వతంత్రదేశములందు భావిదేశాభ్యుదయమునకు ఏకమాత్రావలంబముగ నెంచబడు యువయువతు లెందరో దురదృష్టవశమున నహితుల కోపాగ్నికి గురియై కీలికీలలచే గప్పబడిన కవటాకుపాత్రుల వలె ఖైదులలో నమయుచున్నారు. ఆంధ్రయువలోకమునందు

"సరసకౌతుకగీతాప్రసాద మొకడె
కలదయూ నౌకయందు గావలసినంత."

ఉత్సాహపుపొంగు కార్యసాధనావశ్యకత యెదుట నిలుచుట లేదని కవి అతిసున్నితముగ మందలించుచున్నాడు.

మాతృస్వరూపురాలైన స్త్రీకి విజ్ఞానవిహారము వెలిజేసి స్వతంత్రవ్యక్తిత్వమును జంపివేసి,

"ఇంట బానిసిచాకిరే సర్వమని తూర్పు
పడమర లెరుగని"

యజ్ఞురాలినిగా జేసిన పాపబీజమునకై ప్రతిఫలముగ జాతిదాస్యము సంభవించినదని తలచినవాడగుటచే ఎగిరి పోవుట కలవాటులేని పసపుపిట్టలకీ పాపబంధము లెన్నాళ్ళని రాయప్రోలు సమకాలికుల హెచ్చరించును.

ఆంధ్రభాషాపరిణామము నిట్లే విమర్శించుచు కవి నూతనసారస్వతపథముల నడువ సాహసించుచున్నాడు. ఆంధ్ర సారస్వతముయొక్క వారసత్వము దిగనాడుట కవి కసమ్మతము. ఉద్రేకపూరితులైన కొందరు కవికుమారులవలె ఇతఃపూర్వము వెలసిన యాంధ్రవాఙ్మయ మంతయు నిస్సారమైన యెడారి యని త్రోసిపుచ్చడు. ఆంధ్రభాష చిరకాలమునుండి రాజుల యాదరణముబడసి నీటుగులుకు రాజులచేతి నిమ్మపండు అయి వెలసెను. కొన్నినాళ్లు లోకమోహనముగ ఆంధ్రభాషాకన్య వీణె మ్రోగించెను. కొన్నినాళ్లు ఆవీణ ముసుగునంబడి చిరనిరాదరణాహతిచే జెడిపోయెను. ప్రబంధయుగాంతమందు ఈలోక మోహనమైన వీణె సొగసుచెడి నిద్రామాంద్యతచే గాబోలు కనుమూసెను. ఇది కాలధర్మనియతిచే జరిగెను. వెన్నెలలు నిద్రబోవుచున్నవి ఉదయసామ్రాజ్యవైభవముముందు. నిద్రామానము వహించిన ఆంధ్రభాషాకచ్ఛపిని దరిసి తెలుగు భాషకు విశిష్ట లక్షణమైన

"పలుకు బడియింపు సన్నంపు తెలుగుకళుకు"

తో నవ్యపథముల పోయి క్రొత్త క్రొత్తసంగతుల పలికించుట కవియాదర్శము.

............'లలిత లలిత
సుశ్రుతిస్వీయసామ్రాజ్యశోభ నింత
క్రొత్తలకు రుచిసూపించి హత్తవమ్మ'
అని తెలుగుకన్యకకు సలహా నిచ్చుచున్నాడు.

కవి పూర్వవాఙ్మయమునం దెంతయాదరముగలవా డైనను నడచినత్రోవలనే నడుచు ప్రతిభాశూన్యుడు గాడు. వాఙ్మయరంగముపై క్రొత్తప్రసాధనవిధులు నెరపిన తిక్కన సూరన మున్నగు మహాకవులు వెలసిన యీ తెలుగునాటిలో స్వతంత్రకవితాపథవిహారము కుంఠితము కాలేదని కవి తలంచును.

'తెగినతంతుల మరల బంధింపనేల
నిలిచియున్న యేకశ్రుతిని సవరించి
వేడుకయు వేదనయు రసవిదులు మురియ
పాడవమ్మ గీతాసఖి! భావపదము.'

ఆదికవులు సుహృత్సమ్మితములును అర్థప్రవణము లగు పురాణేతిహాసములచే కర్తవ్యతాబుద్ధిని ప్రోత్సహించిరి. ప్రబంధకవులు సరసరచనారీతుల నానందస్ఫురణమే యాదర్శముగా నెంచిరి. ప్రబంధకవులకు శృంగారమే ఏకరస ప్రాయము. జీవితము వారికి వసంతఋతువునందలి మనోహర

సూర్యోదయము. నిరంతర శరచ్చంద్రి చంద్రికా విలసితము. వినిర్మలజీవితాకాశమునందు కృష్ణమేఘపుతునుకలైనను వారికి గాన్పింపవు. జీవితకాసారముపై అననుకూలవాతాహతి వారు సైపజాలరు. ప్రబంధయుగమునాటి సంఘజీవితము నిస్తరంగముగ ప్రవహించియుండనోపు. అథవా కవివతంసములజీవితము లెడతెగని వెన్నెలవెలుగై వారి మణిగణస్థగితప్రాంగణ భూములందు,

'నయత్యయుగ్మచ్ఛదగంధిగార్ద్రితాం
భృశం నృపోపాయనదంతినాం మదః'

కావున శృంగారమే వారికి కావ్యోపస్కారహేతువైన రసముగ నొప్పియుండును. నేడు సంఘము తలిరులశయ్యపై వేసటచే పొరలుటలేదు. విలసన్నవనందనంబుల మాత్రము విహరించుటలేదు. కరవు, దరిద్రము, నిరాశ, నిష్ఫలమైన వ్యవసాయము నేటి సంఘమునకు వేరుపుర్వులై యున్నవి. కవులుగూడ వగపుగంటులకు వెలిగారు. ఆందోళికాఛత్ర చామరములతో వారిని పూజించి,

"ఎదురైనచో తన మదకరీంద్రము డిగ్గి
కేలూత యొసగి యెక్కించుకొను"

వారు లేరు. అనుదినము సంఘహృదయమునందు దురంతసూచీ ముఖంబులు గుచ్చుకొని దారుణాఘాతము లగుచున్నవి. అత్యాచారభూయిష్ఠమైన భరతదేశమందు స్నేహలతామతల్లి వంటివారివిశుద్ధకన్యాత్వము భీకరపరిణామమునకు లోనగు

చున్నది. కాలవ్యత్యయముచే 'కష్టకమల' వంటి లేమొగ్గకన్నె లెందరో అకాలమృత్యువువాత బడుచున్నారు.

"అన్నకాటక మటులుండ నావహించె
భూమి నానందదుర్భిక్షమును సఖుండ."

వీణె చేబూని కవి పాడ నెంచునప్పటికి వ్యథితమైన మాతృముఖమండలము భావవీథిలో పొడగట్టెను. ఆపె దుఃఖము వెలార్చుటకై యొకసుకవి యక్షరజీవగీతికను గోరుకొనెను. రాయప్రోలు ప్రబంధపద్ధతినే వ్రేలాడి సత్యమును జూడక కనులు మూసికొని నాయికానాయకుల కృతకవిరహముతో నయ్యాటలాడినచో ఆధునికకవిత్వమునం దీస్థానమును బొందలేడు. మిగిలియున్న యేకశ్రుతిని నవరించుట చేతనే కావ్యజీవితహేతువైనట్టియు సత్యమైనట్టియు ఉదారమైనవస్తువు కవికి లభించెను. మహాకవి భవభూతికివలె రాయప్రోలునకు గూడ.

'ఏకో రసః కరుణ ఏవ నిమిత్తభేదా
ద్భిన్నః పృథక్పృథగివ శ్రియతే వివర్తాన్.'

ఎవ్వరికి శృంగారము కరుణామయమైన జీవితప్రవాహమునందు బుద్బుదప్రాయమో, ఎవ్వరికి తదితరరసములు ఏకమాత్రస్థాయియైన కరుణరసమునకు విభావానుభావాదులవలె ప్రోద్బలకారణములో, ఎవ్వరికి కరుణాతంతువాక్కటే జీవితసూత్రములు వాయించగల సాధనమో, వారు మనకవి కత్యంతప్రియులు, అనుసరణీయులు.

'స్నాయురుచ్ఛేదమైన కష్టమ్మునందు
మధురసుఖము నాస్వాదించు శిథిలహృదయు
లెవరో వారల కంజలి నిడుదు—'

కావుననే దుఃఖాంతమైన వృత్తములు రాయప్రోలు వారికవితావిషయములు. ఆనందస్ఫురణమే స్థాయిభావముల పరిణతిప్రయోజనమైనను శృంగారాదిమధురరసములు మాత్రమానందజనకములని ఘంటాపథముగ చెప్పజాలము. స్థాయి భావమునొందినసుఖదుఃఖానుభవము లన్నియు కవితావిషయములై యానందస్ఫోరకములని ఆంగ్లకవి Wordsworth వచించెను.

'Poetry is emotions remembered in tranquillity.'

నాట్యాచార్యుని రసబాహుళ్యమును సంపూర్ణముగ పోషించుటకై సుఖాంతములు దుఃఖాంతములు నగు కావ్యములు నాటకములును మనలో వెలయవలసియుండెను. కాని మన పూర్వకవులు పరిణతివిరసము లనియో, లేక కావ్యప్రయోజనమైన ఆనందస్ఫురణము ఉద్ధతరసములచే నిర్వహింపబడదనియో తలచి అతిప్రౌఢరసములను కేవల మానుషంగికముగ గ్రహించిరి. అదిగాక ధర్మజయమునే కీర్తించు టాదర్శముగాగలవా రగుటచే కథాసందర్భమును సహజమార్గమున పోనీక నాయికానాయకుల నతిక్లిష్టపరిస్థితులలో జొప్పించియు, వారికి దుఃఖపర్యవసానము గల్పించుట ధర్మపరాజయ మగుటచే మానవబుద్ధిచే గానప్పుడు దైవికమైనసామగ్రిచే వారికి దుఃఖవిమోచనమును సుఖప్రాప్తియు గల్పించినారు. ఈ దృ

క్పథము ప్రకృతిలోని ఏకమాత్ర భాగమును చూపించుచున్నది. ఋషులతో సమకాలికులైన గ్రీకువారు ఆర్యకవిసాంప్రదాయములకు విరుద్ధమైన సిద్ధాంతములను ప్రతిపాదించిరి. మనకవులు సుకుమారరసములు మాత్రమే ఆనందస్ఫోరకములని యెంచి సుఖాంతవృత్తములు నిర్మించినట్లే గ్రీకువారు ఉద్ధతరసములు మాత్రమే ప్రేక్షకులలో మనఃకల్లోలము గల్గించి ఈశ్వరశక్తిబోధన గల్గించునని తలంచెడివారు.

'Through pity and fear to purge the feelings'

అని వారి యుత్కృష్టకవితా నిర్వచనము. రౌద్రబీభత్సరసములకును తద్ద్వారా కరుణరసమునకు మాత్రము వారి కష్టాంతనాటకములందు తావు గలదు. శృంగారరసమయమైన మధురబంధమునకు వారి యుత్తమరచనలందు చోటు లేదు. ధీరోద్ధతనాయకుడు ప్రచండమైనజీవకల్లోలినిలో తుపానులోని నావవలె యల్లాడి తుదకు తుత్తునియలై పోగా మానవుని యకించనత్వమును, అల్పశక్తిత్వమును, ప్రకృతినేపథ్యాంతర బింబితమైన యీశ్వరశక్తియొక్క అనివార్యసర్వోత్కర్షత్వమును స్ఫురింపజేయుట గ్రీకుకవులకు ప్రియము. ఈరెండుమతములును సత్యమునకు ప్రతిబింబములె.ఒక్కొక్కటియు అద్దమువలె ముందుజూపించుచున్నది గాని రెండవవైపు చూపుటలేదు.

మన కావ్యప్రపంచములో సుఖశంఖారావములే గాని దుఃఖదంభోళినిపాతములు వినరాకుండుటచే కొరత గల్గెనని చెప్పవలసివచ్చుచున్నది. ఈలోపమునుపూరింపదలచుకొన్నాడు రాయప్రోలుకవి. లోపమును పూరించుటేగాదు—దుఃఖ

తంతువు కవియొక్క అభిమానవాద్యము. దీనికి ప్రతిపదిక కవిజీవితములోనే ఉండియుండవచ్చును.

'వగపు లనురావి మొలక లెదిగినకొలది
చిత్తభిత్తిక లేరీతి జిటిలి విచ్చె?
బాల్యదశలె యెడారులవలెను మరుగ
వెత కళాసించి కుతుక మేగతి కృశించె?'

కనకవలయభ్రంశరిక్తప్రకోష్ఠుఁడైన యక్షునియందు కాళిదాసునెట్లు జూచుచున్నామో, ఉత్తరరామచరితమందలి కరుణాలహరి భవభూతి జీవితమందలి శోకవాహినిలో పిల్ల కెరటమని యెట్లూహించుచున్నామో ఆదే సూత్రము.

'ఏడుపు ప్రియమ్ముగా వచియింపరే మొ?'

అనుకవివాక్యము నన్వయించును. మిసమిసలాడు మెత్తనియిసుకమీద, చంద్రకిరణములు చెరలాడు వేళ, హృదయమందు, నాకసంబందు, తారలందు, నిశ్శబ్దము మౌనము వహించిన సమయమందు, జీవితసూత్రము నన్వయించు వాక్యములు కవికి వినవచ్చెను. "ముత్యములు కడుపున మోసిన శుక్తికి గర్భవిచ్ఛేదమగుచున్నది. గెలలు వేసిన యరటిచెట్లు సమూలముగ నరుకబడుచున్నవి. ఒకని పూర్ణిమ మరొక్కని కమవసనిసి. శ్రావణపయోదబాష్పధారాభరంబు నెమలికన్నియలకు ప్రీతి. నాడు కోవిలగొంతుక విరుద్ధఋతుధర్మముచే రుద్ధమై గానలహారి గుండెగొంతుకలో కొట్లాడును. నిబిడ నీరంధ్రతమస్సులనే నాకసము నావరించిన మేఘముల నిందింపనేల? అప్పుడేకదా విద్యున్మాలయొక్క కడారదీధితులు

చూడగల్గుట. బాధనళుభరించినగాని ప్రేమమాధుర్యము తెలియబోదు. దుఃఖసూత్రమే మానవుని ఈశ్వరపరతంత్రుని జేయును. తల్లి స్తనము నోట బడునంతవరకు శిశువు ఏడ్చునట్లే భగవంతుని పొందువరకు భక్తుడు తపించ వలసిన దేగదా! సుఖాంతమే ప్రకృతిపరిణామము గాదు. సుఖదుఃఖసూత్రముచే జీవితసమస్య నన్వయించవలెను." కావుననే రాయప్రోలుకవి, కావ్యస్త్రీ

'కృష్ణనిశలసాంగత్య మిం కేమిజెప్ప!'

కృష్ణనిశలసాంగత్యమున నిర్బంధజ్యోత్స్నలందు కన్న జీవితసత్యమునకు సన్నిహితతరమని యూహించి ఆధునిక విప్రలంభగానమునకును కృష్ణపక్షాభిమానమునకును బీజమును వేసియున్నాడు. కృష్ణపక్షాభిమానియయ్యు కవి ఆత్మదుఃఖమునే జలప్రళయముగ నెంచి నిశ్వాసతాళవృంతములతో వీచికొనుచు దీనదృష్టులతో ప్రపంచసానుభూతికి ఎదురుచూచుట లేదు. తన వ్యక్తిగతదుఃఖముల కన్నీటిదొంతరల సరులను ఓడికలవలె కూర్చుచు, పసిబాలుడు శిథిలితాంగములైన తన యాటవస్తువుల మనముం దిడి ఓదార్పుకొరకెదురు చూచునట్లు మనల నిర్విణ్ణుల చేయడు. అతనికి నిరుపమ నితాంతదుఃఖంపునిధులు లోభివాని బంగారుగనులవలె చూచి మురియుటకొఱకు గాదు. కంటకచారియయ్యు కంటకముల తొలగించుకొనుమార్గము గానక వానినే ప్రేమించు దుర్బల విధికి పాల్పడి కంటకకిరీటధారియై కులుకుట కిచ్చగింపడు. దుఃఖసూత్రముగూడ నాతనికి ఒక పరమప్రయోజన

మాకాంక్షించియే ప్రియమైనది. జీవితసామరస్యమే ఈ మహత్ప్రయోజనము. లోకకల్యాణమే పరమావధి. కావ్య ప్రపంచమునం దింతవరకు వృద్ధిచందుడే కాని క్షీణచంద్రుడు వెలుగలేదు. కాని హీనచందుడుగలరాత్రులు లేకపోయినవా? కావున సుఖదుఃఖసూత్రముల రెంటిని గ్రథించి నిర్వేదము నిరుత్సాహము కరడుగట్టిన దీనమనంబులలోఁగూడ పరమా మోదము నింపుట, కష్టసంఘటనము ప్రకృతిధర్మ మగుటచే ననివార్యమని గుర్తించి వెఱగుపడి దూరమునుండియే తొలగి పోవు సంకుచితత్వమునకు బాల్పడక జీవితవిహంగమునకు సుఖదుఃఖములు రెండు రెక్కలవలె నుపయోగించునని చిత్రించి జీవితసంపుటమునందలి సంపూర్ణసత్యము ప్రకటించుట, రాయప్రోలువారి యాశయ మని గుర్తించనగును.

ఈ మహదాదర్శమును కవి తృణకంకణమందు మ్రోల నుంచుకొన్నాడు. తృణకంకణము కవియొక్క ఉత్కృష్టకావ్య మని పలువురు తలంచుచున్నారు. ఇందలి కథాపాత్రౌన్నత్యము, శైలియందలి నర్మవ్యాపారము ఒకదాని కొకటి తీసిపోవని వగుటచే నీ కావ్యమున కీయగ్రస్థానము గల్గెను. బ్రహ్మాదులు గూడ నేభావరక్తికి వెలిగారని మహాకవి భవభూతి యూహించునో, ప్రేమ యను ఏనిబిడసూత్రము సృష్టియందలి సమస్త పదార్థములను ఒండొరులవంక కాకర్షించి,

"మిత్రో దాధార పృథివీముత ద్యాం"

అంతరాళస్థుడైన సూర్యుడు భూనభంబుల ధరించినట్లు, అన్యోన్య సంఘర్షణలేకుండ భరించునో, అట్టి ప్రేమతత్త్వముయొక్క

నిగూఢరహస్యమును కవి తాను గాంచినరీతి నీ కావ్యసుమ మందు మధువువలె పొందుపరచినాడు. పాలును మీగడయు మోదిపి పండిన యన్నములు చేతికి మూతికి ఎంగిలిలేకుండ పిన్నటనుండియు తిని ఆబాల్యారక్తమైన ఒకానొక పడుచుజంట తేటవలపులు మొలకెత్తినదిమొదలు ఒండొరులయెడ పవిత్ర రాగమునిలిపి, వలపులుపండువేళ యెడబాటునకు లోనయ్యెను. అరుంతుదమైనవియోగశల్యముచే గలిగిన వగపుగంటు లింకను పచ్చిపచ్చిగ నుండగనే వారొక పరిచిత ప్రదేశమునందు సమావేశము నందిరి. అందు పురుషప్రకృతి కొంతధూర్తమైనది. స్త్రీ సౌమ్యప్రకృతి. "దైవహతకుడు వృంతమునుండి లతాంతము నెడసేసి కృతకృత్యుడైనాడు. లతాంత మింక నశింపకుండునా? వలచుజతల విడదీయ బాల్పడిన యీసృష్టి దైవికము గాదు. ఆసురము. కాలకరాళుడు చపలుడు, క్రూరుడును. మోహనవసంతునకు ముదముగూర్చు మావిపసపుటాకును నిబిడహేమంతరాత్రులలో వేధించనేల? ఎడబాటులలయించెడు నీదినములలో అమృతము విషము నేకమే యైనవి. రక్తిలేమి శూన్యభావములు రుచింపవు. బాహ్యజ్ఞానవిద్యార్థినై కాలంబును వయస్సును వ్రయించెదను." అని బిట్టువాపోయెను కుమారుడు.

స్త్రీప్రకృతి గంభీరమైనది. కష్టసహనము స్త్రీత్వమును సృజింపనెంచినబ్రహ్మ మొదటిపాలుగ స్వీకరించెను. భూమిపై నివసించు జంతువులలో భూత్వము స్త్రీయందు ప్రాధాన్యము వహించినది. ఆపతితములైన దురంతవిపర్యయములందుగూడ

నామె పరులను నిందింపదు. దైవమును సందేహింపదు. తా నన్నియు భరించి యాత్మశక్తిని పెంచుకొని యపరాజితయై నిల్చును. ఋజుతార్కికమార్గమున జీవింపనెంచిన శ్రీరాముని కాఠిన్యము పరమావధిని బొందినప్పుడు భూసుతయైన సీత మాతృగర్భము జొచ్చుటయే ప్రత్యుత్తర మని తలంచెను. శాపవశమున దుష్యంతుని పారుష్యము సహింపరానిదైనప్పుడు సాధ్వి శకుంతల ఆకాశగామినియై తల్లిమరుగు జొచ్చెను. కుమారుడిట్లు నిరాశాజనితనిర్వేదమున సృష్టియందు నిరన్వయ విపర్యాసమును గల్పించుకొనుచుండ; కుమారి ప్రేమోపనిషత్తు నాతని కిట్లు జిజ్ఞాసచేసెను: "మిత్రమా! ఏల మాతృగర్భ విమర్శనము చేసెదవు. మధుమాసముతో నంకురించు పల్లవములు హిమవదాగమనమున నశించునట్లె పడుచుదనముతో వచ్చు వలపుమెరుగుకూడ జరాక్రాంతిదశల కృశించును. వలపు నైమిత్తికమైనది. దాని కస్ఖలనవృత్తి లేదు. ప్రేమ వ్యవస్థ వాచామగోచరమైనది. శాశ్వతమైనది. మనోవాక్కాయ కర్మములచే వలపు కలుషితము కాదగినది. ప్రేమ ఆధ్యాత్మిక మగుటచే తపసుచే, తాల్మిచే, ధ్యానధారచే లీనముకాదగినది. వలపు భౌతికసంబంధము నాకాంక్షించి మలీమస మగును. అంతరంగముల నతుకజాలిన యపూర్వపులంకె స్నేహము. దానికి భౌతికసమావేశముతో పనిలేదు.

'వ్యతిషజతి పదార్థానాంతరః కోపి హేతు
ర్న ఖలు బహిరుపాధీన్ ప్రీతయః సంశ్రయంతే.'

దైవసంపత్తువలన ప్రేమోదయ మగును. కావున

నా బాల్యపోషిత మైన మన విశుద్ధస్నేహలతను తుంచి వేయు పాపముల కేల నొడిగట్టెదవు!"

కవి యిట్లు విప్రలంభమును సమన్వయించి మనుష్య ప్రకృతియందలి యుదారాశయములను ప్రోత్సహించును. విప్రలంభ మొక యుపాసనామార్గము కవికి. వలపు భౌతిక మైనది. జతలసంసారసుఖము పరిధిగా గలది. ప్రేమ నిరవధి యైనది. ఈశ్వరునివరకు ప్రాకి,

'న తత్ర సూర్యో భాతి న చంద్రతారకం
నేమా విద్యుతో భాంతి కుతో౽యమగ్నిః'

సూర్యచంద్రులు విద్యుల్లతలు లీనమగునావెలుగులో లీనమైపోవును. విప్రలంభమునందు వలపు తపించి తపించి ప్రేమకు తావిచ్చును. సంయోగమునం దుత్తరోత్తరవృద్ధికి ఎక్కువ అవకాశము లేదు. అసంతుష్టియే పురోవృద్ధికి సోపానము. భక్తుడు విప్రలబ్ధుడు. ఈశ్వరుడే యాతని అభిలషిత కాంత. అభిమతప్రాప్తికై యాతడు తపసుచే, తాల్మిచే ధ్యాన ధారచే కష్టించును. ఒక్కొకప్పుడు తాను వాసకసజ్జకయై వల్లభుడైన యీశ్వరునికొరకెదురుచూచును. ఆతడు విప్రలంభపథమున స్వాధీనపతిక యగుచున్నాడు. భక్తుడు చాతకి వలె ఈశ్వరప్రేమధారాసంపాతమునకై విప్రలంభగ్రీష్మము నందు దపించునని రవీంద్రుడు చిత్రించుచున్నాడు.

'The rain has held back for many days! Oh Lord!'

ఒక్కొక్కయెడ భక్తుడు విరహోత్కంఠితా నాయకి

వలె విమనస్కుడై ఈశ్వరునికై ఎదురుచూచుచు పసచెడి పడియుండు నని రాయప్రోలుకవి తలంచును.

'హేమపాత్రిల చందన మెండిపోయె
ద్వారములు మోయుచున్నవి హారములను
సానలం దింకె స్నానకషాయగంధ
మబల యెవనికొరకు నగ్నమై కృశింతు?'

—విరహావీథి.

అయిన విప్రలంభమందు గల్గు దుఃఖమునకు సమాధాన మేమి? కన్నీటి కెరటాలలోనుండిగాని వెన్నెల కనుబడదా అని యడిగిన కవి యిట్లు సమాధానము చెప్పెను.

'కోమల ప్రేమ సంపూర్ణ కుసుమదశల
నలరునపుడె దుఃఖరజస్సు స్ఖలనమగును
వర్ష ధారల కడుగంగబడినపొలమె
యార్ద్రమయి పచ్చబడునంచు నరయలేరె?'

విప్రలంభమునం దింతయౌన్నత్య మున్నచో సంయోగము మాటేమి? ప్రేమఫలించిన జతకు ముక్తిత్రోవ కంచె వేయబడినదా? కాదు; ఆమార్గము వేరు. ప్రియతమవస్తుప్రాప్తి చే ప్రాణికి హాయికుదిరి తన్మయోన్మీలనా మోదసుఖము కల్గును. ఇది పూలత్రోవ. సుకృతమునుబట్టి మార్గములేర్పడును. ఈప్రేమపథమునే పరిహరించి ప్రకృతిసూత్రములను కాదని మనసు బిగబట్టుకొను హఠయోగులకు తన్మయోన్మీలనా మోదసుఖము దుర్లభము. లోకసామాన్యులీ త్రోవను బోరాదని శ్రీకృష్ణుడు చెప్పుచున్నాడు.

"ప్రకృతిం యాంతి భూతాని
నిగ్రహః కిం కరిష్యతి."

"ఒక వ్యక్తిగతమైన ప్రేమతో నారంభించను. నేను విశ్వమానవప్రేమకును ఈశ్వరతత్త్వమునకును ఒక్కగంతులోనే చేరెదను." అను నసాధ్యాదర్శముగల హారిస్వాదర్శికి కవి యిట్లుపదేశించును "మలయమారుతముచే చిరుతయల లుయ్యాల లూగుకొలనులో చెర్లాడక యే ప్రళయఝంఝానిలోద్ధూతకల్లోలినియైన సముద్రములో దుముక నెంతువా!"

"భావమొకచోట నిలువ పూబందమేసె
నే మనోహారి, యాకన్నె మోముజూచి
స్వరము నాలించి, ప్రేమ కంజలి యొసంగు
మెల్లప్రాణుల కాప్తుడనే యటంచు."

చిన్నవలయమునుండి నీటిపై పెద్దవలయము లేర్పడునట్లు ప్రేమసలిలములపై గూడ అభిమతపదార్థాభిమానము నుండి విశ్వమానవప్రేమవరకు జీవి ప్రాకును. ఆశ్రయము ననుసరించి ప్రేమ త్రివిధమని కవి సూచించుచున్నాడు. 'ధర్మగ్రంథియైన దాంపత్యభక్తి, స్తన్యమోహనమైన వాత్సల్యసక్తి, మిత్రులయెడ లోకమునందు గాన్పించు సఖ్యరక్తి.' ఇదిపురాతన సాంప్రదాయము; ఆర్యఋషుల యాదర్శము. పాశ్చాత్యులలో మన మెరిగినంతవరకు ప్రేమకు స్థూలముగ 'Love' అను ఒక్క శబ్దమే వర్తించుచున్నది. వారికి దాంపత్యము అవిచ్ఛిన్నమైన బంధముకాదు. ఐహికసుఖమునకై జతలు తమ

తమ ఇచ్ఛాధీనముగ విరమించుకొనదగిన తాత్కాలిక సంబంధము. వారు సఖ్యరక్తినే యాకాంక్షింతురు. సఖ్యములేనినాడు వివాహగ్రంథిని తెమల్చి నూతనకంకణధారణమునకై కడగుదురు. కావుననే పామరదృష్టికి పాశ్చాత్యదంపతులలోనున్న సఖ్యరక్తి ఐహికసంతృప్తియు మనదంపతులలో కాన్పించవు. ఋషులయాదర్శభేదమే దీనికి కారణము. వివాహగ్రంథి నిరంతరధర్మబంధమని వారియాశయము. దీనియందు సఖ్యరక్తి ఉండవలసినదే.

'సఖా సప్తపదా భవ
సఖాయౌ సప్తపదా బభూవుః.'

లౌకికసౌఖ్యమును సూచించునదే గదా సాప్తపదీన విధి. జతలసంబంధము ముఖ్యముగా పూర్వసుకృతము ననుసరించునని పెద్దలమతము. దాంపత్యమునందు భక్తియే ప్రధానముగాని రక్తిగాదని వారి నిశ్చయము. అదియే స్త్రీకి ముక్తిమార్గము. ఆర్యదాంపత్యమునందలి పతిభక్తి స్త్రీజాతియెడ పురుషునిదౌర్జన్యము, నిర్బంధముపై నిర్మింపబడినదని సంకుచితదృష్టితో వాదించుటకన్న దాంపత్యభక్తి స్త్రీస్వభావమైన యాత్మార్పణముపై పునాదివేయబడినదనిగుర్తించుట మేలనితలచి, సనాతనఋషులయాదర్శము నీగతి నన్వయించి పునరుజ్జీవితముచేయు నాసతో కవి,

'పరమధర్మార్థమైన దాంపత్య భక్తి

... ... ...

అందు నాదిమమగు ప్రేమయందె ముక్తి,

యని వచించుచున్నాడు. ఆదర్శజీవితము ముండ్లత్రోవ. ఆదర్శముయొక్క సత్యజ్యోతి హృదయమందు వెలుగుచున్న ప్పుడే యీ ముండ్లత్రోవ నడువసాధ్యము. ఆదర్శముయొక్క మహోద్దేశము మరువబడి కేవలకృత్రిమనిబంధములలో చిక్కుకొని ఇహపరదూరులగుటకన్న ఇచ్ఛాధీనముగ జీవించుట మేలని కొందరివాదము. నీళ్లు పల్లమునకు పారు స్వభావము గలవి గాన పల్లమునకేపోనిమ్మని. ఆదర్శజ్యోతి నార్పివేయుట కన్న విమర్శాతైలము తిరిగిపోసి సత్యమైన వెల్తురును గల్గించి పూర్వఋషులసంతతివార మనిపించుకొనుట కంటకాకీర్ణ పథమైనను కవి యీ త్రోవయందే సంకెళ్ళతో నడచుచు,

"త్రెంచలే నెట్టులో సహియించువాడ
నన్నగిల్లు హస్తమునుండి జారుదాక"

అని తనకు దిటవు చెప్పుకొనును.

దాంపత్యభక్తియందే స్త్రీకి ముక్తిగలదని పాతపాట పాడినకవియందు నూతన మేమున్నదని సందేహపరులు తలంతురు. స్త్రీప్రకృతియందలి మహోన్నతత్వమునందు కవికి గల సంపూర్ణవిశ్వాసమే ఈ నిర్ణయము నాతనికి దోపించెను. యమనియమాదికృచ్ఛానుష్ఠానములచే పురుషు డనుసంధానించు తత్వమును స్త్రీ కల్పనాసామర్థ్యముచే ననుభావ మొందించుకొనును. కృచ్ఛానుష్ఠానములు స్త్రీసామ్యప్రకృతి కనావశ్యకములు. ఏకలవ్యుని శస్త్రవిద్యనేర్పిన భావనాశక్తియే

యూమెకు తత్త్వావబోధము చేయుచున్నది. కేవలసాహచర్యము చేతనే ఏకసంధాగ్రాహివలె నామె సర్వము సవగతము చేసికొనుచున్నది. ఆత్మసమర్పణబుద్ధియే స్త్రీప్రకృతియందలి ముఖ్యతత్త్వము. ఆత్మానుసంధానమునకు కేవలలక్ష్యప్రాప్తి యునిగ ననుకరించిన పురుషునికి తనసర్వస్వము నర్పించుటలో నాశ్చర్య మేమున్నది? ఏకలవ్యునికిగూడ విద్యయంతయు ప్రత్యక్షీకృతమే. సాంప్రదాయికమైన లక్ష్య మొక్కటి కావలసియుండెను. ద్రోణునియొక్క మట్టిబొమ్మకూడ నా పని జేయజాలియుండెను.

మహాపురుషప్రకృతికూడ స్త్రీ ప్రకృతివలె భావనామయమైనది. జృంభకాస్త్రములు వారికి స్వావగతములు. కేవల వ్యక్తీకరణమునకై గురువు తోడ్పడును. మహాపురుషుల గురుభక్తి వారికి న్యూనత నాపాదించునదా? అది వారి కొకయలంకారము. దాంపత్యభక్తియు అట్టిదే. దానికి నిర్బంధపాలిత పథంబులేదు. ఆత్మార్పణమునకు మరియొకనామము. స్త్రీకి ఇదేమార్గము గాని అన్యమార్గము లేదని వాదించుట సత్యదూరము. దాంపత్యమార్గము లోకసామాన్యము. జ్ఞానులైన కొందరుపాశ్చాత్యులుకూడ ఇదేసూత్రమును ప్రతిపాదించుట గుర్తించదగిన విషయము. మిల్టను (Milton) అను కవీశ్వరుడు భగవద్భక్తుడు, నిష్పాక్షికుడు. ఆదిదంపతుల తపోరంగమును వర్ణించుచు,

'He prayed to the Lord
And she the God in him.'

ఈశ్వరానుసంధానమునకు మాతృస్వరూపురాలైన యామె పతిని అవలంబనముగ జేకొనెనట.

స్త్రీత్వమునందలి మహత్త్వమును ప్రతిపాదింపనెంచిన వాడగుటచేతనే రాయప్రోలుకవి కావ్యప్రపంచమునందు స్త్రీయెడ నూతనమర్యాదను ప్రతిష్ఠించి భావకవిత్వము నున్నత పీఠికపైకి నెక్కించెను. సారస్వతము కాంతాసమ్మితమని యెంచబడుటచే స్త్రీప్రకృతిని భోగ్యవస్తువుగ చిత్రించుట కవిసమయ మయ్యెను. కవి కాముకనయనములతో స్త్రీని వీక్షించి రాగమను కుంచెతో వ్రాయుచున్నాడు. స్త్రీ భూషణమైన యాత్మార్పణము పూర్వకవులైన కాళిదాస భవభూతులయనంతరము విశేషము గుర్తింపబడుటలేదు. స్త్రీని ఎంతసేపు పీనోన్నతస్తనిగాను అస్తినాస్తివిచికిత్సాహేతుశాతోదరిగాను పరిదర్శించునేగాని ఆమె కొకయాత్మ, వ్యక్తిత్వము, ప్రకృతియం దొకస్థానము, ప్రయోజనము కలదా యని జిజ్ఞాస చేయడు. ఇట్టి కవిత్వము స్త్రీయొక్క సుకుమార శరీరమే విషయముగాగలది యగుటచే ఆమెయొక్క వలపు, విరహము, అభిసరణము మున్నగు మనోహరవిషయములను మాత్రము తడుముటచే అతిమృదులమే నిస్సందేహముగ. కాని పూర్ణసత్యమును నిష్ఫాకణములవలె విడిచిపెట్టినది. స్త్రీ పావిత్ర్యమును వాసనగూడ చూడదు. తుదకు స్త్రీసహజమైనలజ్జకూడ ప్రతిబంధకమని కొందరు శృంగారవాదుల మతము.

'ఆదౌ వాచ్యః స్త్రియా రాగః
పుంసః పశ్చాత్తదింగితైః'

ప్రేమవిషయములో స్త్రీని మొదట కృతపదురాలినిగ చిత్రించి తరువాత పురుషుడు ఆమెప్రేరేపణచే రక్తుడయ్యె నని చెప్పుట మనోహరమని వాదించిరి. దీని కొక కారణ ముండవచ్చును. జీవితము భోగమయముగ నుండెడిదినములలో సుఖకల్పనలు రుచించెడివి. ఆసుఖస్వప్నములలో కవికుమారులు స్త్రీయొక్క శృంగారమూర్తినే దర్శింపనెంచిరిగాని యామె యుజ్వలపవిత్రబింబమును సందర్శింప నెంచలేదు. వారు మన వలెయింటనుబయటనుగూడసమయాసమయములందు స్త్రీవ్యక్తిత్వమును గూర్చి వితండవాదములు చేయనులేదు. ఈయుగ మందు గల్గిన భావకల్లోలములో స్త్రీవ్యక్తికి ప్రత్యేకార్హత గుర్తించుట ముఖ్యవిషయము. సమకాలికాభిప్రాయములకు వెలిగాడు కవి. కావుననే భావకవిత్వమునందు స్త్రీమాతృపీఠము నలంకరించునని ముక్తకంఠముతో మనకవి బల్కుచున్నాడు. స్త్రీప్రకృతిని మాతృస్థానమున కెక్కించుటచే సుఖమయవర్ణ నములకును,నునులేతశృంగారపుపోకడలకును తావులేక కవితా దారిద్ర్యము కలుగునని వగవ బనిలేదు. ప్రకృతియం దాతడు మాతృకల్పనము చేసికొనుచున్నాడుగావున పవిత్రభావముతో మాతృరాగమును వర్ణించును. అతిప్రౌఢశృంగారఘట్టములను ప్రబంధకవిత్వమునందువలె వాచ్యముగ చేసి మర్యాద నతిక్ర మింపక ధ్వనితార్థములుగ విడచివేయును. మహామాతృస్వరూ పురాలి సృష్టిక్రమమును వర్ణించుకవివలె

'కామేశ్వరముఖాలోకకల్పితశ్రీగణేశ్వరా'

పతిముఖావలోకనముననే మహాగణేశ్వరుని కల్పించె నని సూచించునేగాని ఉదారశిశుజననమును మాతాపితరుల సంభోగతరంగములలో ముంచివేయడు. పరిదృశ్యమానమైన భూతప్రకృతియందు భావకవి మాతృత్వము నుపలక్షించును. నోరు మెదపగానే 'తల్లీ' యను సంబోధ మాతనికి తెలియకుండగనే వెడలుచున్నది.

'శ్రీమాతా !'

ఇది యత్యంతసనాతనమైన ఋషిసాంప్రదాయము. ఇందు మహత్త్వము ఔదార్యముగలవని వేర నిరూపించ నక్కర లేదు. ఈపవిత్రకల్పనమును సారస్వతోపాసనములోనికి గొని వచ్చిన రాయప్రోలుకవిని తజ్ఞులు మెచ్చుకొనగలరు. ఆతడు ప్రకృతియందు మాతృబంధము నన్వేషించును.

'దప్పిగొని చేరిన మిళిందతనయులకును
బూలపా లిచ్చి చీకట్ల బోవకుండ
గడుపులో దాచుకొనదె పంకజము ప్రియుడ!'

భట్టికావ్యమునందలి ఈ క్రింది శ్లోకముతో దీనిని పోల్చిచూచిన యిరువాగుల కవికుమారుల యాదర్శభేదము విస్పష్టముగ గోచరించును.

'ప్రభాతవాతాహతికంపితాకృతిః
కుముద్వతీరేణుపిశంగవిగ్రహమ్

నిరాస భృంగం కుపి తేవ పద్మినీ
న మానినీశం సహతేఽన్యసంగమమ్.'

పత్రికృతిచిత్రములందు రాయప్రోలుకవి ఔచిత్యమునే గుర్తించును.

'పత్రవస్త్రాపహరణ విచిత్రుడైన
శిశిరు వివృతరిరంసను సీదరించి
చిగురుచెంగావికోక లిచ్చితివి శుభవ
నీమతల్లుల సంస్కృతనీతి నెఱిగి'

—వసంతవికాసము

ఆదర్శపురుషులయందుఁగూడ రాగకల్పనము, అనౌచిత్యము పోషించిన రాధామాధవుల సాంప్రదాయికశృంగారవృత్తిని నిరసించి కవి విశుద్ధప్రేమస్ఫురణముచే నూతనాదర్శమును నిర్మించినాడు.

"కడిమిపూజెట్ల దట్టమౌ గట్లకెలన
మృదులసైకతశయ్యల రేలు పవలు
నాడుకొన్న రాధాకృష్ణు లస్తమింప
నెట్టు లోర్చెనో గాళిందిహృదయ మకట!

సరసతరవేణుచారణచతురుడయిన
చిన్నిగోపాలు కాంక్షించి స్నిగ్ధహృదయ
పరవశోన్మాదమున రాధ పాడినట్టి
భక్తిగీతము లీమెగర్భమున గలవు."

కవితావ్యవసాయమును గురించి రాయప్రోలుకవి భావి కవికుమారుల నిట్లుద్బోధించును. మహాకవులచే నలంకరింప బడిన కవితాసీమలలో సామాన్యులకు తావులేదని వగవనేల.

'తుమ్మెదలు గ్రోక్కెననుచు మధువు త్యజించు
భావము విరక్తిగాబోదు పడుచువాడ!'

నిశ్శంకగ ప్రతియువకుడును సారస్వతవ్యవసాయము చేయదగినదే. అదియుగాక సంకుచితమనస్కులవలె మనకవి మహాకవిపోకడల ననుసరించుట చౌర్యమని తలంచి వెరవడు. ఏలన భావమున కంటులేదు. కాళిదాసునకుతోచిన భావము భవభూతికి తోచగూడదా!

'అనుభవింపు ప్రేమోచ్ఛిష్టమున కుమార!
అంటులేదని నీ యాప్తు లంపినారు.'

కావుననే మహాకవులరచనలు రాయప్రోలుకవియందు ప్రతిధ్వనించుచున్నను ఎరువునగల తళుకును గాక సహజా లంకారశోభను వహించుచున్నవి.

కవి తన సారస్వతపథంబును ఇట్లు నిరూపించు చున్నాడు.

'ఎవరులేని గవాక్షసంవృతతలాన
ననుబిలచి బందమేసె సుందరి యొకర్తు
తెల్లసురపొన్నపూలసంకెళ్ళతోడ
నిందులకు దైవమొకడె యదృష్టసాక్షి.'

చేతిలో చేయివైచి నన్ జెప్పుమనియె
తీయని యెలుంగుతో "నివి తెగింపననుచు"
తెగించలే నెట్టులో సహియించువాడ
సన్నగిల్లు హస్తమునుండి జారుదాక.'

నిజమే! నాడు కవితాగవాక్షమునందు బలువురులేరు. రాయప్రోలునకు మొదట సంకెళ్లు దవిలెను. సన్నగిల్లు హస్తమునుండి జారువరకు కవిత్వపుసంకెళ్ళు వహించెద నను కవిప్రతిజ్ఞ కవితాంజలివంటి సుమములను మోసికొని రాగలదో?——ఇంకా మనకు.

———

# చంద్రోదయము

25—3—27

గీ. భువనమెల్లను వజ్రాలు ♦ పొదివినట్లు
స్వర్ణదీతీరముంబొంచె ♦ సైకతముల
తపసుదాల్చిన పుణ్యుల ♦ ధన్యవదన
దివ్యతేజంబు పుడమికి ♦ దిగినయట్లు
శాంతభావంబుసొంపు ది♦నాంతమందు
చంద్రు డుదయాద్రి నెక్కంగ ♦ జగము నేలె.

కుంజసమూహంబులోనుండి ♦ గోగుపూల
గుత్తియో, సురమందార ♦ గుచ్ఛమొక్కొ ?
సంజవేళల మఘవాను♦సముఖమునకు
బూర్ణసౌందర్యరచనల ♦ బోవు సూర్య
శిరమణిపాదయుగళ వి♦శీర్ణమగుచు
కొమరుమించిన పారాణి ♦ గుబ్బయనగ
అంధకారము వెల్వడె ♦ నమృతకరుడు.

తనమనోవీధిగప్పిన ♦ ఘనవియోగ
హిమమునుగ్గాడు నాయకు ♦ డిల్లుజేర,
ఆ నిశాకాంత ప్రియమార ♦ హారతిచ్చి
దిక్కులం జల్లినమణుల ♦ దివ్వెలనగ
మిన్నుతలమున రాజిల్లె ♦ మిన్కుగములు.

సవతిపుట్టింట పాల్నీట ♦ జలకమాడి
ధౌతచంద్రికారజమున ♦ పూతవడసి
వెల్లనై గన్పట్టె భూమాత ♦ వెన్నెలందు.
తల్లికెదురేగ త్వరపడు ♦ తనయులట్లు
పిల్లతెమ్మెరలు పుడమి♦తల్లిగూడ
పరుగులెత్తుచు వీచె న♦భంబునుండి.

ప్రకృతియంతయు నవ్వెను ♦ పకపకంచు,
నీలనభసంబు దూల్నాడు ♦ నిగ్గుగులుకు
కొలనిలోనుండి తారల ♦ కలువ బిలిచె,
కాల్వమీఁద చిరుయలలు ♦ కలకలంబు
నేయుచుఁ వింతగీతాన ♦ సెవుల దనిపె;
నీటిప్రక్కన జీవించు ♦ నీడవాసు
లుదరపోషణ యత్నంబు ♦ లుడిగి నిద్ర
యనెడి ప్రియురాలి సాంగత్య ♦ మనుభవించె;
నిద్రగన్నెరువృక్షంబు ♦ నిద్రవోవె
కాల్వ కావల పనసయు ♦ కాయ లదర
చంద్రు గౌరవించెడునట్లు ♦ చలన మొందె.

నామనంబును చిరుగాలి ♦ నావనెక్కి
ప్రకృతిజలనిధి నీదంగ ♦ బయలువెడలె.



# కోయిల

25—4—27

గీ॥ నవవసంతోదయం బది ♦ నాడ యయ్యె
నీవు సనుదెంచి తీ తీర ♦ జీవనముకు
అర్ధకాలంబు మధుమాస♦మందు గడచె
నీకు స్వాగతంబు వచింప ♦ నేర్వనైతి.

శిశిరఋతువు గ్రుంకు దినాల ♦ చిరుయుగంబు
లందు క్రీడించుచు మరచి♦తమ్మ నిన్ను!
ఆమ్రశాఖయు నిన్బలె ♦ నాప్తుడంచు
తనదునీడల గూర్చుండ ♦ దయను బిలచె;
సంజపశువుల డెక్కల ♦ సద్దువినుచు
శివునినాట్యంపు ధోరణి ♦ చెవులనిండ
నిన్ను నేమరితిని సేయు ♦ మన్ననంబు.

ప్రభువసంతుడు ఫాల్గున ♦ పక్షమందె
యరుగుదెంచెను చిగురులే ♦ యక్షతలను
జల్లుచుఁ దిక్కులందు నీ♦జాడలేదు.
ఎప్పు డేతెంతువోయంచు ♦ నింతవంత
గూడియుండంగ నొక్కట ♦ కూసితీవు.
పూర్వపరిచితుకా మమ్మ ♦ పొందితనుచో
విందుసేయు లేమావుల ♦ పొందుగనుచో
అవిరతంబుగ పాడి తై♦దవరవాన.

భవదుదారగానంబున ♦ భక్తుడగుచు
నీదురూపంబు దర్శింప ♦ నేను కుజము
కడకుపోయితి నేమందు ♦ గాంచితచట;
పచ్చనాకుల దేహంబు ♦ పంతగింప
చివురు జొంపములను ముక్కు ♦ చెలిమిసేయ
రామనామాంకితంబైన ♦ రామచిలుక,
నీలవర్ణాన చోద్యమా ♦ పాలపిట్ట,
శిరమునందును సౌందర్య♦చిహ్నముగను
రమ్యమా కుచ్చుగల్గు వ♦డ్రింగిపులుగు,
సుభగరూపు లిందరుండ ♦ చోద్యమాయె
కాకినలుపున బడయుట ♦ గౌరవంబు.

తెల్లమాయె రహస్యంబు ♦ దిట్టకాడ!
రూపుగుణముచే గప్పితి ♦ రోయకుండ,
రాలగరగింప కృష్ణుడు ♦ జాలెమురళి
పాపజాతిని జోగొట్టె ♦ భవ్యగీతి
పసులు మేయక యాలింప ♦ బరపె రవము
గానమాధుర్యమహిమంబు ♦ గాదె వేలు!
పరభృతా! నీవు ప్రత్యక్ష♦వాసుదేవు
డౌదు గాకున్న నీశక్తి ♦ యలవడునొకొ?

కుహుకుహూయని పల్మరు ♦ కొసరి కొసరి
బల్కునాదంబు కర్థంబు ♦ బడయగలమె?

అది వసంతవిజయ మొక్కొ? ♦ అంగహీను
ప్రీతిసల్పెడు సామంబొ? ♦ వెన్నుబరువు
ధరకువ్రాలంగ ప్రశ్నింతొ ♦ ధాన్యలక్ష్మి?
ఎల్లకాలము మధుమాస ♦ మిట్లు చెల్ల
వలెననుచు సల్పుచున్నావొ ♦ ప్రార్థనంబు?
జీవలోకంబు ముదమున ♦ నీవుబలెనె
ఈదు చాడుచు పాడుచు ♦ నెలమి నుండ
సుస్వరంబున బోధింతొ ♦ సుభగగాత్రి!

చిరువిహంగమ నీకు మ♦త్సరము మెందు
అనుచుదోచెడి నాకు; ని ♦ న్ననుకరించు
చిన్నిబాలుర కోపంబు ♦ సేయనేల!
చేసి కంఠంబు సన్నగా♦కూసెదేల?
గాయకోత్తము డౌటను ♦ గానరీతి
పిన్నవారికి మప్పంగ ♦ పెనగుచుంటొ ?

ప్రథమకూకూరవంబున ♦ పాంథరమణి
తనమనోహరురాకను ♦ తథ్యముగను
చాటినావని మురిసెను ♦ చాలప్రొద్దు;
విరహవేదన రేతిరి♦వెన్నెలందు
కాగిక్రాగిన యాపెయే ♦ కరుణమాలి
వేకువనెలేచి వేధింతు ♦ వాకు మెక్కి
అనుచు చెలులతో నిందించు ♦ నౌర! నిన్ను.

ప్రియఖగంబ! నీదుకత తోఁ♦పించె మదిని
కవివతంసము గూడెడు ♦ కష్టములను
తనదు నానందలహరిలోఁ ♦ తన్నుకొనుచు
కవి వచించెను, లోపంబు ♦ గాంచనేల?
భవ్యమోదాంబుధినిమున్గి ♦ పాడి తీవు
ఒకరి సంతస మారయ ♦ వొకరిదుఃఖ
హేతుల గావింప నెంచితి ♦ వంచు దలప.

పికమ! ఆనందసీమకు ♦ నికట మయితి,
ఉపనిషత్కాలంబున ♦ చపల వీవు
దివ్యఋషులను పాటల ♦ దేర్ప లేమ
గాక నేకాదశానంద♦ఖండమందు
పరభృతానంద మొక్క టే♦మరుదు రెట్లు?
మానవానంద మది నీకు ♦ మానమగునె?
మనుజదివ్యగంధర్వాలు ♦ మన్నుదినరె?
కర్మదేవులు ముదమున ♦ కారుసాటి,
ధిషణు నానందమునుకూడ ♦ ధిక్కరింతు
వా పితామహునానంద ♦ మమరె నీకు!



# ఎల్లకాలంబు బాల్యమా!

14—6—29

సీ॥ చిన్నట నీనాటు ♦ చిన్నితమాలంబు
లేండ్లు గడచినపై ♦ నెదుగ వాక్కొ ?
పరువైన క్షేత్రాన ♦ మొలచినబీజంబు
లేజాతివో జను ♦ లెరుగవలదె?
వేణుగానవిలోల ♦ విస్పష్టగీతికా
రవముల జిలికింతు ♦ రాలుగరుగ
ఆలమందలు లేళ్ళు ♦ నాలించె చెవులిచ్చి
కాకదివాంధముల్ ♦ గనలకున్నె

గీ॥ ఇందుదరహాసచంద్రికల్ ♦ చిందువంద
శాద్వలస్థలి తోలియాట ♦ సలుపదలతు
నల్లత్రాచులు మనపొంత ♦ నక్కయుండ
ఎల్లకాలంబు బాల్యమా ♦ వెఱ్ఱికృష్ణ!

సీ॥ అమృతపానంబంచు ♦ నాదరంబున నిత్తు
హాలాహలంబగుట ♦ నరయ వమల!
చివురుజొంపములంచు ♦ చేబట్టితేగాని
వృశ్చికాలై నన్ను ♦ వెతలదూల్చె,

జిలిబిలిపాటల ♦ చెవులునింపితిగాని
కాచినసీసమై ♦ కాల్చె నన్ను,
పరిణయంపువెలిసీట ♦ జలకమాడించితి
మురికినీ రాయెనో ♦ ముగ్ధహృదయ !

గీ॥ విమలయమునాతరంగిణీ♦వీచికలను
తేలిపోవుద మిర్వురై ♦ తెప్పమీద
చెల్లెలా ! రమ్మని ♦ చేరబిలుతు
కౄరవై తరణీనది ♦ గెంటదల తె ?



# అనుతాపము

సీ॥ చిరుయలల్ చదలేట ♦ చెంగలింపనిచాయ
గట్టులం బడద్రొబ్బి ♦ కలచినాడ,
కోర్కెలు పితికెడు ♦ కుజముపై జంటకు
పసరికపామునై ♦ మెసలినాడ,
బొగడనీడల పొంత ♦ బువ్వాబంతులనాడు
పసికంఠముల నెమ్మి ♦ బరపినాడ,
అరటాకు నమృతంబు ♦ నాసించు మిథునంపు
కెలన విసము లొలి♦కించినాడ,
పూవు తేనియపొందు ♦ పొంగు వసంతుపై
నుప్పుకల్లుల పెక్కు ♦ గుప్పినాడ,

గీ॥ ప్రణయబాసల దవిలిన ♦ పక్షిజతకు
కాలరూపినై, శాపాగ్ని♦కీల మడియు
బోయకన్నను నధముడౌ ♦ బోయనైన
నన్ను శపియించువాల్మీకి ♦ యున్నవాడె ?



# కవి వేదన

గీ॥ పచ్చిబాలెంతప్రొద్దుల ♦ బడినయువతి
పొంగిపొడిచెడు స్తన్యంబు ♦ పొంతబోక
మూతబిగిసిన ముత్యంపు ♦ ముగుదవోలె
నిదురదవిలిన పసికూన ♦ గదిసిగదిసి
తుద కెదే నొకవేదన ♦ తొందరింప
పాప మేల్కాంచ జోలలు♦ పాడుటేల?

సంధ్య నప్సరబాలలు ♦ శాద్వలముల
నారగట్టిన వలిపెంబు ♦ లన కషాయ
దీధితులు పర్వ నారణ్య♦వీధి వెడలి
పులుకుపులుకున చేపెడు ♦ పొదుగుగులుక
నోటిలేబచ్చికచిగుళ్ళ♦మాట మరచి
ఇంటి తెరవు జనుమొదవు; ♦ చంటిదూడ
రాక నెలపొడుచు ప్రశాంత♦రమ్యవేళ
ఏపుచెంగలి బయళ్ల ♦ నెందొ దడియు,
చిరుతగంటల సద్దెన ♦ చెవినిబడక
విన్నబోయిన గోమాత ♦ చెన్నుదరిగి
స్రుక్కి త్రుళ్లింత పరవళ్లు ♦ త్రొక్కియాడ
బిరుసుగొడ్డని భ్రమసెదో ♦ బేలమనిసి!

నింగియనుజొన్నచేను వి♦హంగకులము
పొట్టవడకుండ నొడిసెల ♦ బూని దరుమ

నినకృషీవలు డటు మంచ ♦ నెక్కుటాది,
కలకలావ్యక్తజయరావ♦ములను సంజ
నాకసం బీను చందాన ♦ మూకవడ్డ
పిట్ట లదలింపగనులేక ♦ పేద నిద్ర
పైగొనఁగ, చిన్నివెన్నెల♦బాలు చేను
గాపుగనిడునంతవరకు; ♦ కర్షకుండు
గ్రీష్మసంతాపసందగ్ధ♦కృష్ణభూమి
అత్తకోతల బీడ్వడ్డ♦యతివ యెడద
బోలె నెరద లెడల, దున్ని; ♦ పోడిమి చెడి
శుష్కలాంగలవ్యాపార ♦ శూన్యత బడి
ఇంట తనకాంత తొలిసారి ♦ యింటిపడుచు
ఎదురు తెన్నులు చూచునం ♦ చెంతో యార్తి
పొరుగు కంచెల జొరబడు ♦ పోతుటెద్దు
లాసపరకల మ్రుచ్చిలు ♦ నూసుమరచి
చని గృహాభిముఖంబుగ ♦ సరగు సరగు
గంజియే పరమాన్నంబు ♦ గంచె డెత్తి
పాగతలగడ భూస్థలి ♦ బడలి సొలసి
తల్లినిద్దుర తొడపైన ♦ తలను దాచు
మరచిసర్వంబు, ప్రియురాలి ♦ మరచి దన్ను;
ఇంటిపని లేమ వడివడి ♦ గెంటివేసి
సగముమెతు కోగిరించి స♦సంభ్రమమున,
అత్తగొంగడి మున్ముంద ♦ యమరపరచి
లలితశుభ్రాంబరధారియై ♦ రమణు జేరి

పెద్దయుం బ్రొద్దు పదముల ♦ పేరునేయి
వ్రాసి, ప్రియుడు ప్రసాదంబు ♦ వడయకున్న
నీళ్ళునమలుచు, మన సారు♦మూడువడగ
కట్టుచీరను విప్పును, ♦ కట్టుమరల,
అమరుబుచ్చుట సడలించి ♦ యల్లుజడను,
వ్రేగునాకసంబును బోలు ♦ పెట్టె సద్దు,
పిన్నటిదినాల వరిచేల ♦ వెన్నుకోత
పండువెన్నెలలందున ♦ బలుకుపదము
లంతకంతకు పులకించు♦గొంతునెత్తి
పాడుకొనుచుండ కన్నుల ♦ పాలు దొరగ,
పాడుయాగడ మనిలేతు ♦ బడుగుముసలి!

గందపుంజెట్ల పుట్టింట ♦ ఘనులు, పెనుఘ
నాఘనసోదరులు సారె ♦ నడకతోడవు
లూసగ, క్రొన్నిటివెల్లువ ♦ లురక లిడగ,
ఎండుసస్యసుతలకు పా♦ల్పిండిపోయు
నురుగుగ్రక్కునదీమాత ♦ పరుగువారు
పాటినీళ్ళసైకత పథము పొంచె
వ్రాసితుప్పట్టి, చెడుగుడి ♦ బద్దెలెన్నొ
నాటినాడవు యీహద్దు ♦ దాట దనుచు
దర్భకాష్ఠములను నీటి ♦ దరిని తీర్చి,
చెరగిపోయెను గీతలు ♦ చేటువరద
చిరుతక్రోపాన నదిలోన ♦ చిన్నిరాళ్ళు

విసరు బాలక! నీవెంత ♦ పిన్నవన్న
ఆప్రివాహరహస్తత్వ ♦ మర్థ మవునె?

స్తన్యవేదన యాపడ్డ ♦ తల్లి యెరుగు,
విరహజోత్కంఠకీలల ♦ నెరుగు యువతి,
ఒడ్లనొరయు జలభరంబు ♦ నొడ్డు లెరుగ,
రతులభావకల్లోలంబు ♦ నాత్మయెరుగు.

సీ. ప్రతిభాసోదరి కాన్కగా నొసగు నా
మ్రిం బొందు పళ్ళెంబునం
దతివిన్నాణ మలంకరించుకొని యా
హ్లాదింతు భావాబ్ధిలో
చతురాకారిణి యావిమర్శసతి ని
స్సారం బిసీ! మేలుసం
తతియే? బంగెనపల్లి కాదనగ సం
తాపించుదే సత్కవీ!

